అర్ధరాత్రి రెండు గంటల సమయం.

ఆనందరావుగారి యింట్లో ఫోను గణ - గణ మంది.

నిద్రకళ్లు నలుపుకుంటూ వచ్చిన ఆనందరావుగారి భార్య శారదాంబ ఫోను రిసీవరు అందుకుని 'హలో' అంది మత్తుగా.

'ఎవరు మాట్లాడేది?' అవతలినుంచి ప్రశ్న.

'ఆనందరావుగారి యిల్లు. ఎవరు కావాలి మీకు?' అంది.

'ఓ! శారదాంబగారా! నమస్కారమండి! నేను-రాజశేఖరం మాట్లాడుతున్నాను. ఆనందరావుగారు లేరా!'

'లేరు! విందుకు వెళ్లారు. ఇంకా రాలేదు. ఏం యింత అర్ధరాత్రి పోలీసు ఇన్‌స్పెక్టరు గారికి వారితో అవసరం వచ్చింది.' మెల్లగా నవ్వుతూ అంది శారదాంబ.

అవతలి కంఠం నిశ్శబ్దంగా వూరుకుంది.

'ఏం శేఖరం! మాట్లాడవేం' అంది శారదాంబ.

'ఫోనులో చెప్పదగ్గ విషయం కాదు. శ్రమ అనుకోకుండా మీరు ఒక్క పదినిముషాలు మేలుకున్నట్టయితే నేను స్వయంగావచ్చి మనవిచేసుకుంటాను' అన్నాడు రాజశేఖరం.

అతని కంఠంలో మార్పు గమనించి శారదాంబ ఒక్క క్షణం నిదానించి 'దానికేం అలాగే రా!' అంటూ ఫోన్

కట్ చేసి త్వరగా లోనికిపోయి నైట్ గౌనుమార్చి జార్జెటు చీర కట్టుకుని వంటమనిషిని లేపి కాఫీ చెయ్యమని పురమాయించి డ్రాయింగ్ రూంలో సోఫాలో రాజశేఖరంకోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

పది నిముషాలు దాటకుండానే రాజశేఖరం ప్రత్యక్షమయినాడు. 'శ్రమకి క్షమించాలి. చాలా అవసరమైన విషయం కనుక మిమ్మల్ని డిస్టర్బ్ చేసాను' అన్నాడు సోఫాలో చతికిల పడుతూ.

'ఫరవాలేదు. అసలు విషయ మేమిటో చెప్పు' అంది శారదాంబగారు వంటమనిషి తెచ్చిన రెండు కప్పులలో ఒకటి శేఖరానికి అందిస్తూ.

శేఖరం సంశయంగా వంటమనిషి వంక చూశాడు. అతని ఉద్దేశం గ్రహించి శారదాంబ వంటమనిషిని లోపలికి వెళ్ళమని 'ఇక చెప్పు' అన్నట్టు చూచింది శేఖరం వంక.

'ఆనందరావుగారు ఎన్ని గంటలకు బయటకు వెళ్ళారు' శేఖరం అడిగాడు.

శారదాంబ తెల్లపోతూ 'నువ్వడిగేదేమిటో నాకేమీ బోధపడటం లేదు. కొంపతీసి ఆయనకేమీ.....'అంటుండగానే శేఖరం అందుకుని- 'అబ్బే! అటువంటి దేమీ కాదమ్మా! ఆయన ఎన్నిగంటలకు బయటకు వెళ్ళారో తెలుసుకుందామని అడుగుతున్నాను' అన్నాడు శేఖరం.

'ఎనిమిది గంటలకు న్యాయమూర్తి కాంతారావుగారి యింటికి ఆయన కుమార్తె వివాహ సందర్భంలో జరిగిన విందుకు వెళ్ళారు'

'అయితే విందు యింకా జరుగుతూనే వుంటుందా?'

'అలాగే అనుకుంటాను. లేకపోతే ఆయనీపాటికి యింటికి చేరుకునే వారేగా' అంది శారదాంబ.

'జడ్జిగారి ఫోన్ నెంబరు తెలుసా' లేచి ఫోన్ దగ్గరకు వెడుతూ అడిగాడు శేఖరం.

'ఎనభై రెండు- నలభై ఏడు - అరవై మూడు' ఎక్కాలు తప్పు చెపుతున్నట్టుగా వల్లించింది శారదాంబ.

శేఖరం నిశ్శబ్దంగా రిసీవరు ఎత్తి 824763 డైల్ చేశాడు. రెండునిమిషాలు రింగయినతరువాత అవతలవైపు రిసీవరు ఎత్తిన చప్పుడువిని 'హలో! న్యాయమూర్తి కాంతారావు గారి యిల్లేనా' అన్నాడు శేఖరం.

'అవును' అవతల సమాధానం.

'వారితో మాట్లాడటానికి వీలు కలుగుతుందా?'

'బహుశ కలుగదనుకుంటాను. విందుకు చేసిన ఏర్పాట్లతో అలసిపోయి పడుకున్నారు. అంతగా అవసరమయితే మీ పేరు చెబితే లేపడానికి ప్రయత్నిస్తాను' అవతలివైపునుంచి సమాధానం.

'అవసరం లేదు. విందు ఎన్నిగంటలకు ముగిసిందో చెప్ప గలరా' అన్నాడు శేఖరం.

'పదకొండూ పదిహేను నిముషాలకు అతిధులందరూ వెళ్ళిపోయినారు'

'ఆనంద్ ఫైనాన్సు కార్పొరేషన్ యజమాని ఆనంద రావుగారు ఎన్నిగంటలకు వెళ్ళారు' శేఖరం ప్రశ్న.

'ఆఖరున వెళ్ళింది ఆయనే! అసలు యీ విషయాలన్ని మీకు ఎందుకు కావల్సి వచ్చాయి? అసలు మీరెవరు?' అంది అవతలి కంఠం.

శేఖరం మాట్లాడకుండా ఫోను కట్ చేసి చేతులు రెండు కోటు జేబులోనికి పోనిస్తూ తలవంచుకుని ఒక్క నిముషం ఆలోచిస్తూ వుండి పోయాడు.

'ఆయనక్కడ లేరా!' శారదాంబ ప్రశ్న అతనిని తిరిగి యీ ప్రపంచానికి తీసుకు వచ్చింది.

'లేరు. పదకొండుగూ పదిహేను నిముషాలకే అక్కడినుంచి బయలు దేరారు' అన్నాడు శేఖరం మెల్లగా.

'మరయితే ఏమయినట్టు? శేఖరం నువ్వేదో విషయం దాస్తున్నావు? నాకు చెప్పు! వారికి ఎలాటి ప్రమాదం జరుగ లేదుగదా!' అంది ఆదుర్దాగా.

'అమ్మా! మీరు అనవసరంగా గాభరాపడకండి! ఆయన కొచ్చిన ప్రమాదమేమీలేదు. అయితే ఒక అత్యంతక్లిష్ట మయిన పరిస్థితిలో యిరుక్కున్నారు. అది వారివల్ల పరిష్క రింపబడాలి' అన్నాడు.

'అదేమిటో నేను తెలుసుకోవచ్చా?'

శేఖరం ఒక నిముషం నిదానించి ఒక నిశ్చయానికి వచ్చి నట్టుగా శారదాంబ వంక చూస్తూ - 'మీనాక్షి అనే రెండవ తరగతి సినిమానటి మరణవాంగ్మూలం ప్రకారం ఈరాత్రి 12-1 గంటలమధ్య యిలియట్సుబీచిలో ఆనందరావుగారు ఆమెను చెరచ యత్నించి ఆమె పెనుగులాడగా కత్తితో గాయపరచి కారులో పారిపోయారు' అంటూ ముగించి ఆమె ముఖం చెందుతున్న మార్పులను గమనించి ఆమెదృష్టినుంచి తప్పించుకు కేందుకు యత్నించసాగాడు.

శారదాంబ పిడుగుపడ్డట్టు కొయ్యబారిపోయింది. రెండు-మూడు నిముషాలకు కొద్దిగా తెప్పరిల్లి - 'శేఖరం నిద్రలో నీకేమయినా కలవచ్చిందా! ఏదైనా మత్తుపదార్థం సేవించి

వచ్చావా! కాకపోతే అయనేమిటి స్త్రీహత్యచెయ్యడ మేమిటి? అందులోనూ చెరచ యత్నించటమేమిటి?' అంటూ తీక్షణంగా అడిగింది.

'కాదమ్మా! ఇది కలాకాదు! నిషాలోవున్న వాగుడూకాదు. ఇదుగో చూడండి. ఆమె రాయపేటఆసుపత్రిలో చనిపోయే ముందు యిచ్చిన మరణవాంగ్మూలం.' అంటూ శేఖరం తన కోటుజేబునుండి ఒక పొడుగాటి కవరు బయటకు లాగి అందులోంచి అరఠావుసైజు పేపరు తీసి ఆమెచేతికి ఇచ్చాడు. శారదాంబ వణికే చేతులతో దాన్నందుకుంది.

'మీనాక్షి అనే నేను యీరాత్రి రెండోఆట ఒక ఆంగ్లచిత్రం చూచి వికలమైన మనస్సుతో త్వరగా యింటికి పోవటం యిష్టంలేక యిలియట్సుబీచి మాయింటికి దగ్గరగా వున్నందువల్ల కొద్దిసేపు మనశ్శాంతికోసం బీచిలో కూర్చుందామని వెళ్ళేను. పదినిముషాలతరువాత నేను కూర్చున్న సిమెంటు బెంచిముందుగా ఒక గోధుమరంగు షెవర్లెట్ కారువచ్చి ఆగింది. నెంబరు MFX 40067. అందులోనుంచి దాదాపు నలభై-నలభైఅయిదు సంవత్సరముల వ్యక్తిదిగి రెండు నిముషాలు నిదానించి నాలుగుమూలలు పరికించి నేను కూర్చున్న సిమెంటుబెంచీమీదకూర్చుని నన్ను తదేకధ్యానంగా చూడసాగాడు. నాకు కొద్దిగా భయమేసింది. వెంటనే లేచి బయలుదేరబోయాను. ఆయనకూడా త్వరగా లేచి 'మీరు ఎటువెడతారు! నాకారులో తీసుకువెడతాను పదండి' అన్నాడు. నాకు భయం ఎక్కువయింది. అయినా చిరునవ్వు తెచ్చిపెట్టుకుని - 'థాంక్సు! మాయిల్లు చాలా దగ్గర నేను నడిచేవెళతాను' అంటూ ముందు కదుగువెయ్యబోయాను. ఆయన త్వరగా నాదారికి అడ్డుతగిలి నన్ను బలవంతంగా తనచేతుల్లోకి తీసుకోవాలని ప్రయత్నించసాగాడు.

నేను అరవటానికి వీలులేకుండా తన బలిష్ఠమైన హస్తాలతో నా నోరు మూసాడు. నాబలంకొద్దీ పెనుగులాడాను. ఆ దుర్మార్గుడు నన్ను బెంచివద్దనుంచి దూరంగా క్రోటన్స్ చెట్లచాటుకు యీడ్చుకుపోయాడు. క్రమంగా నాబలం తగ్గిపోసాగింది. పెనుగులాటలో నాజాకెట్ పూర్తిగా చిరిగి పోయింది. ఆ నీచుడు తన పశుబలమంతా ఉపయోగించి నన్ను పొందాలని విశ్వప్రయత్నం చెయ్యసాగాడు. నాశరీరం అంతా ఆయన రక్కులతో నిండిపోయింది. పెనుగులాడు తున్న నన్ను ఒక్కసారి క్రిందికి పడతోసి నాశరీరాన్ని ఆక్రమించుకోవాలని ప్రయత్నించగా నేను అదను కల్పించు కుని అతనిచేతిని కసితీరా కరిచాను. దాంతో అతను ఒక క్షణకాలంపాటు తన చేతిని నోటిమీదనుంచి తీసాడు. వెంటనే వెర్రిగా 'రక్షించండి' అంటూ భయంకరంగా తెలుగులోనూ, అరవంలోనూ కూడా అరిచాను. నా అరుపు విని దూరంనుంచి యిద్దరు వ్యక్తులు పరుగెత్తుకురావటం గమ నించి ఆ దుర్మార్గుడు వెంటనే ఒక కైజారు బయటకు తీసి- 'అరచినందుకు అనుభవించు' అంటూ ఆ కత్తిని బలంగా నా హృదయంలోకి గుచ్చి ఆ వ్యక్తులు సమీపించేలోపునే కారెక్కి పారిపోయాడు. మనిషి చాలా పొడగు - పచ్చని శరీరం - వేలిన ఖరీదైన ఆకుపచ్చరాతివుంగరం వుంది. ఆకాశం రంగు షార్క్‌స్కిన్ సూటు - వంకులు తిరిగిన క్రాపు - నోటిలో ఒక బంగారంపన్ను కూడా వున్నట్లుంది. ఒటో దిల్‌బహార్ సెంటువాసన చాలా విరివిగా వచ్చింది. పెనుగులాటలో ఆయన తాలూకు పెన్నుఒకటి నాచేతిలోకి వచ్చింది. నే నెలాగూ చనిపోతాను. ఇకముందయినా యిటు వంటి దారుణసంఘటనలు జరుగకుండా చెయ్యాలని ప్రభుత్వం ఆశిస్తే ఆ హంతకుని ఎలాగయినా వెతికిపట్టుకుని చట్ట ప్రకారం శిక్షిస్తారని ఆశిస్తున్నాను.'

# 9

ఆ పైన ఆమె వణుకుతున్న చేత్తో చేసిన సంతకం వంకరటింకరగా వుంది.

స్టేట్ మెంట్ పూర్తిగా చదివిన శారదాంబ నోటమాట రాక నిశ్చేష్టురాలై నిలబడిపోయింది.

'చూశారా! యిదీవిషయం! ఆ యువతి వాంగ్మూలం ప్రకారం-కారునెంబరు పోలికలతో సహా మన ఆనందరావు గారికే సరిపోతాయి. అదీగాక...యిదిగో యిటుచూడండి' అంటూ శేఖరం షీఫర్స్ పెన్ ఒకటి జేబునుండి తీసి ఆమె కిచ్చాడు.

ఆమె దాని నందుకు చూచింది. పెన్నుమీద బంగారు రంగులో చెక్కిన ఆనందరావు పేరు ఆమెకు పడగవిప్పి ఆడుతున్న భయంకరసర్పంలా తోచింది. అలా చూస్తూనే ఆమె పెన్నును జారవిడిచింది. అది నేలమీదపడకుండా శేఖరం మధ్యలోనే పట్టుకున్నాడు.

ఇంతలో తలుపు తెరచుకుని ఆనందరావు లోపలికి వచ్చాడు. నలభైఅయిదు సంవత్సరాల వ్యక్తిఅయినా మంచి అందంగా బలంగా వున్నాడు. ఆకాశరంగు షార్క్ స్కిన్ ఫుల్ సూటు బాగా నలిగివుంది. జుట్టు రేగివుంది. అతను లోనికిరాగానే ఆటోడల్ బహార్ గుమాయింపు పరిసరాలను నింపింది.

'హలో శేఖర్! ఏమిటిది యింత అర్ధరాత్రి యిలా కొట్టుకొచ్చావు?' అంటూ తనరాక గమనించి లేవబోతున్న శేఖరాన్ని భుజాలుపట్టుకుని సోఫాలో కూలవేసి తనువెళ్ళి శారదాంబ సోఫాలో ఆమె ప్రక్కగా కూర్చున్నాడు. ఆమె అతనివంక అదో మాదిరిగా చూస్తూ - చటుక్కునలేచి వెళ్ళి మరొక సోఫాలో కూర్చుంది. ఆమె ప్రవర్తనకు తెల్లబోయిన ఆనందరావు ఆమెవంకే చూస్తూ వుండిపోయాడు.

పరిస్థితి గమనించి శేఖరం 'క్షమించండి ఆనందరావు గారూ! ఈ అర్ధరాత్రి డ్యూటీమీద మీవద్దకు రావాల్సి వచ్చింది' అన్నాడు ఆనందరావు ముఖాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తూ.

ఆనందరావు తెల్లబోతూ - 'ఏమిటి శేఖరం! అంతా ఏదో వింతగా ప్రవర్తిస్తున్నారు' అన్నాడు.

'ఇప్పుడు మీరు ఎక్కడినుండి వస్తున్నారో నేను తెలుసుకోవచ్చా?' అన్నాడు శేఖరం ఆనందరావు ప్రశ్నకు సమాధానం యివ్వకుండానే.

ఆనందరావు నిదానంగా శేఖరం వంక చూస్తూ 'ఇది నువ్వు అధికారపూర్వకంగా అడుగుతున్న ప్రశ్నేనా' అన్నాడు.

శేఖరం ఒకక్షణం వూరుకుని - 'అవును' అన్నాడు.

'అయితే దీనికి నేను సమాధానం యివ్వ తలుచుకోలేదు.' అన్నాడు ఆనందరావు తీక్షణంగా.

శారదాంబ ఆనందరావుగారి వంక అదోమాదిరిగా చూస్తూ— 'శేఖరం ప్రశ్నకు సమాదానం చెప్పటానికి మీకు గల అభ్యంతర మేమిటి?' అంది.

ఆనందరావు ఏమో అనబోగా శేఖరం అడ్డుతలిగి— 'ఆనందరావుగారూ! చాలాకాలంగా నేను మీకు ఆప్తుడిని - మీ 'ఫామిలీ ఫ్రెండ్'ని కూడా. అయితే యీ విషయం నన్ను ఎంత కలవర పెట్టుతోందో చెప్పటం కష్టం. ఏమయినా ఒక బాధ్యతాయుత ప్రభుత్వాధికారిగా నా విధి నేను నెరవేర్చాల్సి వుంటుంది. దయచేసి కొన్ని ప్రశ్నలకు సమాధానం యివ్వగలరా' అన్నాడు బాధగా.

'అందుకనె నాబోలు, పోలీసు అధికారులతోనూ, పాములతోనూ చెలిమి తగదంటారు. స్నేహంగా వున్నట్టె వుండి చటుక్కున కాటువేస్తారు'అంటూ హేళనగా నవ్వాడు ఆనందరావు.

'మీరు ఎలా అనుకున్నా సరే! నేనడిగే ప్రశ్నలకు సమాధానం యివ్వదలుచుకున్నారా!'

'అడగండి' హేళన స్ఫురించే కంఠంతో అన్నాడు ఆనందరావు.

తనను 'అండి' అని ఆనందరావు సంభోదించినందుకు శేఖరు నొచ్చుకున్నాడు. అయినా తన విధి నెరవేర్చాలి గనుక—'మీరు పదకొండు గంటల పదిహేను నిముషాలకు కాంతారావుగారి యిల్లు వదిలారు. ఇప్పుడు రెండు గంటల నలభై అయిదు నిముషాలయింది. ఈ మూడున్నర గంటలసేపు మీ రెక్కడ గడిపారో నాకు కావాలి' అన్నాడు శేఖరం అధికార సూచకంగా.

'దాని అవసరం నేను తెలుసుకో వచ్చా!'

'ఓ! నిరభ్యంతరంగా! రాత్రి 12 - 1 కి మధ్య యిలియట్సు బీచిలో మీనాక్షి అనే రెండవతరగతి సినిమానటిని 'రేప్' చెయ్య యత్నించి ఆమె పెనుగులాడగా కత్తితో గాయపరచి పారిపోయినట్టు నేరం ఆపాదించబడింది.'

ఆనందరావుగారి ముఖం కొత్తగా కొట్టిన సున్నం గోడలా అయింది. క్రమంగా తేరుకుంటూ 'ఎవరిచేత!' అన్నాడు.

'హతురాలు యిచ్చిన మరణ వాంగ్మూలం' అంటూ శేఖరం కవరు తీసి ఆనందరావుగారి చేతికి యిచ్చాడు.

ఆగుర్దాగా కవరునుంచి బయటకు లాగి ఆ మరణ వాంగ్మూలం పూర్తిగా చదివిన ఆనందరావు ముఖం రంగులు మారి ఎరుపెక్కింది—'అబద్ధం—పూర్తిగా అబద్ధం—పచ్చి

అబద్ధం—' అని అరుస్తూ దానిని చింపబోగా శేఖరం అడ్డుపడి—'ఆనందరావుగారూ! ఒక నేరానికి తోడు మరో నేరం చెయ్యబోకండి' అంటూ ఆ కవరు అందుకున్నాడు.

'అయితే నేనే యీ నేరం చేసినట్టు నువ్వు నమ్ముతున్నావా' కోపంతో వుడికిపోతూ గర్జించాడు ఆనందరావు.

'పరిస్థితులు అలా అనిపిస్తున్నాయి. మీరుగనక కాంతారావుగారి యిల్లువదలిన తరువాత యీ మూడున్నర గంటల సేపు ఎక్కడ గడిపారో ససాక్ష్యంగా నిరూపించగలిగితే కేసు 'వుఫ్' న ఎగిరి చక్కాబోతుంది' ఆనందరావు కళ్ళల్లోకి నిశ్చలంగా చూస్తూ అన్నాడు శేఖరం.

ఆనందరావు మాట్లాడకుండా తలవంచుకు కూర్చుని వుండి పోయాడు.

'అయితే మీరు చెప్పదలచుకో లేదన్నమాట' అన్నాడు శేఖరం.

'ఏమీ తోచకపోతే కారులో మద్రాసంతా తిరిగాను' అన్నాడు ఆనందరావు.

శేఖరం హేళనగా నవ్వుతూ—'చూడండి! ఆనందరావు గారూ! ఈ సమాధానం మీరు మరెవరిదగ్గరయినా చెబితే మీమీద అనుమానం దృఢపడుతుంది. అర్థరాత్రి మూడున్నర గంటలసేపు మీలాంటివారు పనేమీ లేకుండా కారులో మద్రాసంతా తిరిగానంటే ఎవరైనా నమ్ముతారా' అన్నాడు.

ఆనందరావు కోపంతో గర్జిస్తూ — 'నమ్మితే నమ్ము లేకపోతే మానెయ్యి—ఏమిటి నీ ఉద్దేశం—ఏమిటి నీ పన్నాగం—ముందు నా యింట్లోంచి బయటకునడు.' అంటూ కేకలు పెట్టసాగాడు.

## 13

అంతవరకూ ఓపికగా వారి సంభాషణ వింటూన్న శార దాంబ—'ఎందుకలా ఆవేశపడతారు! మనకు సహాయం చేద్దామని వచ్చిన శేఖరాన్ని గనుకుకుంటే వచ్చే లాభ మేమిటి? పోనీ జరిగిందిజరిగినట్టు చెపితే అతను మనకు సహాయ పడొచ్చుగా—' అంది.

'అయితే నువుకూడా నన్ననుమానిస్తున్నావన్నమాట' ఆనందరావు ఆశ్చర్యంగానూ బాధగానూ అన్నాడు.

శారదాంబ మాట్లాడలేక తలవంచుకుంది. స్త్రీ జనసహజ మైన కన్నీరు ముంచుకురాగా ఆమె లేచి ఆనందరావు సోఫాలో కూర్చుంటూ అతని చేతిని తన చేతిలోకి తీసుకో బోయింది.

ఆనందరావు ఆమె చేతిని విడిపించుకుని ఆ సోఫాలోంచి లేచి శారదాంబ ఖాళీచేసిన సోఫాలో కూర్చుంటూ—'నన్ను ఎవరు నమ్మినా! నమ్మకపోయినా నేను చెప్పగలిగింది చెప్పాను. ఇంతకన్న నేనేమీ చెప్పలేను. నాకు సాక్ష్యు లెవరూ లేరు' అన్నాడు.

శేఖరం తన జేబునుండి 'షీఫర్సు' తీసి ఆనందరావు గారికి అందిస్తూ—'మరి దీనిమాటేమంటారు? హంతకుడు పెనుగులాటలో హంతకుని జేబునుండి యీ పెన్ను ఆమె చేతికి చిక్కింది. చూడండి' అన్నాడు.

ఆనందరావు నిదానంగా దానివంక చూచి తెల్లబోతూ - 'అవును నాదే! పదిరోజుల క్రితం యిది ఆఫీసులో టేబిల్ మీదనుంచి మాయమైంది. అయితే యీ విధంగా వుపయో గించబడిందన్నమాట' అన్నాడు తనలో తనకే నమ్మకం లేనట్టు.

శేఖరం మరోసారి హేళనగా నవ్వాడు.

'ఆయన మాటలన్నిటికీ నవ్వుతా వెందుకు శేఖరం?' అంది శారదాంబ కోపంగా.

'కోపగించకండమ్మా! ఆనందరావుగారు చెప్పిన రెండు సమాధానాలు యీ కేసులో ఆయన నిర్దోషిత్వాన్ని ఋజావు చెయ్యటానికి బదులు, నేరాన్ని ఆయన మీదనే దృఢపరుస్తున్నాయి. అందుకు నాకు నవ్వొచ్చింది' అన్నాడు క్షమార్పణా పూర్వకంగా.

ఒక క్షణం గది నిశ్శబ్దం.

'ఇంతకన్న మీరు చెప్పగలిగిం దేమీలేదుకదూ!' అన్నాడు శేఖరం ఆనందరావు నుద్దేశించి.

'లేదు' నిర్భయంగా సమాధానం యిచ్చాడు ఆనందరావు.

శేఖరం లేచి ఆనందరావుగారి దగ్గరకువెళ్ళి బాధగా 'అయితే నా విధి నన్ను నెరవేర్చనివ్వండి' అంటూ తిరిగి ఒక క్షణం ఆగాడు.

ఆనందరావు శారదాంబ ఆశ్చర్యంగా అతనివంక చూస్తూ నిలబడి పోయారు.

'ఒక స్త్రీ మానహరణ యత్నం - హత్యా నేరాలమీద ప్రభుత్వం తరఫున మిమ్ముల్ని అరెస్టు చేస్తున్నాను.' ఆక్షణంలో శేఖరం ముఖంమీద గోచరించిన బాధ ఆ దంపతులు చూడక పోలేదు.

'శేఖరం' బిగ్గరగా అరచింది శారదాంబ - 'శేఖరం! కనీసం మన పరిచయమన్నా చూడకూడదా! నువ్వు తలచుకుంటే యీ అరెస్టు ఆపు చేయించగలవు' అంది శారదాంబ ప్రతిమాలుతున్నట్టు.

'క్షమించండమ్మా! నేనేమీ చెయ్యలేను. స్నేహధర్మం కన్నా, ఉద్యోగధర్మం అతీతమైంది. నా విద్యుక్త ధర్మాన్ని

నేను నిర్వర్తించుకుంటున్నాను. నన్ను నిందించకండి. నా చేతులమీదుగా నేనే యీ పని చెయ్యవలసి వచ్చినందుకు ఎంతగా కుమిలిపోతున్నానో ఆ భగవంతునికే తెలుసు' అంటూ శేఖరం తల వంచుకున్నాడు.

'అంతేనా శేఖరం! నువ్వేమీ సహాయం చెయ్యలేవా!' అంది శారదాంబ నిస్సహాయంగా.

శేఖరం మాట్లాడలేకపోయాడు. ఒక నిముషం నిదానించి 'ఈ పట్టణంలో ఆనందరావుగారి మిత్రులెవరైనా జామీను స్తే బెయిల్ మీద విడిపించగలను' అన్నాడు.

శారదాంబ ముఖంలో ఆశాకిరణం గోచరించింది. త్వరగా ఫోన్ వద్దకు పరుగెత్తి - వణికే చేతులతో రిసీవర్ తీసి ఒక నెంబర్ డైల్ చేసింది.

శేఖరం ఆనందరావులు ఆమెవంకే చూస్తూ నిలబడ్డారు.

'హలో ఎం. ఎల్. ఎ. గారి బంగళాయేనా? వారి భార్య కామాక్షమ్మగారిని కొంచెం నిద్ర లేపుతారా! నా పేరు శారదాంబ. ఆనంద్ ఫైనాన్స్ కార్పొరేషన్ యజమాని ఆనందరావుగారి భార్య అని చెప్పండి' అంటూ ఆత్రంగా అంది.

తిరిగి ఒక క్షణం నిశ్శబ్దం.

'హలో' అంది అవతలివైపు స్త్రీ కంఠం.

'హలో! కామాక్షమ్మగారేనా? నమస్కారమండి! యింతరాత్రి మీకు నిద్రాభంగం కలుగచేసినందుకు క్షమించాలి. ప్రాణావసరమైన పని అవటంచేత మీకు శ్రమ యిచ్చాను' అంది శారదాంబ వినయంగా.

'ఫరవాలేదు. చెప్పండి అసలు విషయం ఏమిటి' అంది కామాక్షమ్మ.

శారదాంబ తన భర్తకి వచ్చిన ఆపద వివరంగా తెలియ పరచి, ఎం. ఎల్. ఎ. గారి ద్వారా తమకు జామీను లభిస్తుందేమోనని పిలిచానని చెప్పింది.

'క్షమించండి శారదాంబగారూ! ఇటువంటి విషయాల్లో మావారు జోక్యం కల్గించుకోరు. మేము సహాయం చెయ్య లేక పోయినందుకు చాలా విచారిస్తున్నాము' అంది కామా క్షమ్మ.

'పోనీ అన్నయ్యగారితో ఒక్కసారి నన్ను మాట్లాడ నియ్యండి. వారిని నేను ప్రార్థిస్తాను. మా విషయంలో అలా అనరని అనుకుంటాను' అంది శారదాంబ.

'ఆయనతో మాత్రం ఏం మాట్లాడుతారు. అందులో ఆడవాళ్ళతో మాట్లాడటం అంటే ఆయనకు అసలే సిగ్గు' అంది కామాక్షమ్మ.

'ఓహో అలాగా! ఎం ఎల్. ఎ. గా నిలబడబోతూ నా దగ్గరకు మీరు, ఆయనా కలసివచ్చి మావారిచేత ఖర్చుల నిమిత్తం పదివేల రూపాయలు అప్పు యిప్పించమని దాదాపు కాళ్లుపట్టుకు ప్రాధేయపడ్డారే! అప్పుడేమయిందమ్మా ఆ సిగ్గు' అంది శారదాంబ కోపంగా.

'ఓహో! సమయం దొరికిందికదా అని దెప్పుతున్నారా! మీ ముష్టి పదివేలు ఎవరికీ అక్కర్లేదు. వడ్డీతోసహా తిప్పి మీ ముఖాన కొడతాము. కొంచెం కాలం ఓపికపట్టండి. డబ్బు అప్పు యిచ్చారుకదా అని అడ్డమైన బజారుముండల్ని హత్యచేసిన ముండల ముతాకోర్లందరికీ జామీను యివ్వటా నికే ఎం. ఎల్. ఎ. గా ఎలక్టయ్యారా మావారు ..' అంటూ ఆవేశంగా ఏమేమో అంటుండగా వినలేక శారదాంబ రిసీ వర్ గభీమని మోతచేస్తూ పెట్టి ముఖం చేతుల్లో దాచుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది.

అటువంటి స్థితిలో ఆమెను చూచిన శేఖరంగుండె నీరయి పోయింది. ఆనందరావుమాత్రం నిర్వికారంగా నవ్వుతూ - 'అయిందా! కష్టాలలో సహాయం చేసేవాడెవడూ లేడని యిప్పటికయినా గ్రహించావా!' అన్నాడు.

శేఖరానికి ఏదో ఆలోచన తట్టినట్టయింది. 'శారదాంబ గారూ! కోడంబాకం యునైటెడ్ కాలనీలో వామనరావు అనే ప్రఖ్యాత డిటెక్టివ్ ఒకాయన వున్నారు. మీ వారు నిజంగా నిర్దోషి అని ఆయన అనుకుంటే మీకు సర్వవిధాలా సహాయపడతారు... ఆయనే జామీను యివ్వగలరు కూడా' అన్నాడు శేఖరం.

'ఆయనకు ఫోన్ వుందా' ఆదుర్దాగా అడిగింది.

శేఖర్ తన కోటుజేబునుండి చిన్న నోటుబుక్కు తీసి అందులోని వామనరావు ఫోన్ నెంబరు యిచ్చాడు.

శారదాంబ త్వరగా వెళ్ళి ఫోన్ చేసింది. అయితే వామన రావుగారు గ్రామాంతరం వెళ్ళారని, మరుసటిరోజు ఉదయం దాకా రారని వంటమనిషి సమాధానం చెప్పాడు. నిరాశతో రిసీవర్ గట్టిగా శబ్దంచేస్తూ జారవిడిచింది.

అప్పటి ఆమె పరిస్థితి గమనించి ఆనందరావు 'నా కోసం అనవసరంగా శ్రమపడకు శారదా! అయితే ఒక్క మాట! కనీసం నీ హృదయంలోనయినా నేను నిర్దోషినని బుజువు చెయ్యగలిగితే చాలు. అందువల్ల రేపు ఉదయం వామనరావుగారిని ఫోనులోగాని స్వయంగా కాని కలుసుకుని ఒక్కసారి నా దగ్గరకు పంపు' అంటూ శేఖరంవంక తిరిగి ఆనందరావు 'శేఖరం యిక నీ కర్తవ్యం నిర్వహించు' అంటూ బేడీలు వెయ్యమన్నట్టు చేతులు చాచాడు.

శేఖరం నీరసపడుతూ 'అవసరం లేదు - మీరు నా వెంట రండి చాలు' అంటూ ముందుకి దారి తీశాడు.

ఆనందరావు శేఖరాన్ని అనుసరిస్తుండగా శారదాంబవచ్చి ఆయనను కౌగలించుకునిదుఃఖించసాగింది.ఆనందరావు ఆమెను తప్పించుకుని గుమ్మందాటిన శేఖరాన్ని కలుసుకుందామని త్వరగా నడిచాడు. బయట కారు స్టార్టయిన చప్పుడు విని శారదాంబ మొందలం నరికిన వృక్షంలా సోఫాలో కూలి పోయింది.

## 2

'అయితే మీ వుద్దేశం ఆనందరావు హంతకుడు కాదనేనా!'

అంటూ తన ఎదుట కుర్చీలో కళ్ళుమూసుకుని 'డీలక్స్' పొగలు వదులుతున్న ప్రఖ్యాత డిటెక్టివ్ వామనరావుని ఉద్దేశించి అన్నాడు శేఖరం.

'అది అంత త్వరగా చెప్పటం సాధ్యంకాదు. అయినా యీ ఆనందరావు ఏదో విషయం దాచుతున్నట్టు మాత్రం స్పష్టమవుతోంది.' అన్నాడు వామనరావు.

'క్వైట్ రైట్! నేనూ అదే వూహించాను. నిజంగా అతను నిర్దోషి అయితే తన మంచికోరే మనదగ్గ నిజందాచ వలసిన అవసర మేముంది' అన్నాడు శేఖరం.

వామనరావు అతని మాటకు సమాధానం చెప్పకుండా- 'సాయంత్రం నాలుగు గంటల లోపుగా అతన్ని విడుదల చేస్తావుకదూ' అన్నాడు.

'మీరు జామీను యివ్వటం - యింకా విడుదల జరగక పోవటంకూడానా! నిజంగా వామనరావు గారూ! యీ కేసులో నేను తలదూర్చకుండా వుంటే ఎంతోబాగుండేది.

ఒకవైపు అత్యంత ఆప్తుడయిన మిత్రుడు-వేరొకవైపు కర్తవ్య
పాలన. యీ రెంటి నడుమ నేను సతమత మవుతున్నాను'
అన్నాడు శేఖరం విషాదంగా.

'నిజం శేఖరం! మానవులకు అప్పుడప్పుడు యిటువంటి
కఠిన పరీక్షలే ఎదుర్కొంటాయి. ఆటువంటి సమయాల్లో
నీళ్లుగారిపోకుండా ధైర్యంగా నిలబడితేనే-మానవహృదయ
విశిష్టత గోచరిస్తుంది' అన్నాడు వామనరావు అనునయంగా.

'అంతేకాదు! యీ కేసు చూడండి. ప్రతి విషయమూ
ఆనందరావు గారికే వ్యతిరేక సాక్ష్యాన్ని యిస్తూంది. అర్థ
రాత్రి పదకొండుంబావునుంచి రెండు ముప్పావు వరకూ
మద్రాసు రోడ్లన్నీ పిచ్చిగా కారులో తిరిగే వారెవరయినా
వుంటారా! పైగా భూతద్దంలాంటి సాక్ష్యం 'పెన్ను' కని
పిస్తుంది. దానిమీద ఆనందరావు గారివి, మీనాక్షివి వ్రేలి
ముద్రలుకూడా వున్నాయి. ఏనాడో పది రోజులనాడు
పోయిన పెన్నుమీద ఆనందరావు వ్రేలి ముద్రలుండ వలసిన
అవసరం ఏమొచ్చింది. పెనుగులాటలో ఆ పెన్ను మీనాక్షి
చేతికి చిక్కినపుడు ఆమె వ్రేలి ముద్రలు పడటం సంభవమే
కదా! మీనాక్షి మరణ వాంగ్మూలం ప్రకారం - కారు
నెంబరు, యితర పోలికలు అన్నీ అచ్చుగుద్దినట్టు ఆనందరావు
గారికే సరిపోతున్నాయి. ఇక యిందులో Benifit of doubt
కు స్థానం ఏదీ' అంటూ కేసును సింహావలోకనం చేసాడు
శేఖరం.

'అదే నీదగ్గరున్న పెద్ద దుర్గుణం శేఖరం! ప్రతిదీకూడా
చాలా త్వరగా నిర్ణయం చేస్తావు. ఆటునుంచి నరుక్కు-
రమ్మన్నట్టు మనం ప్రతివిషయాన్ని వేరు వేరు కోణాలలో
పరీక్షించాలి. అదే మీ పోలీసు శాఖవారికి మా పరిశోధకశాఖ
వారికివున్న భేదం. మేము మొదట మాక్లయింట్ నిర్దోషి

ఎందుకు కాకూడదా, అనే యోచనమీద బయలుదేరి దోషి ఎలా కాడు అనే వాదనతో ముగిస్తాము.' అంటూ చిరునవ్వునవ్వాడు.

శేఖరంకూడా నవ్వుతూ 'సరే మహాశయా ఒప్పుకున్నాం! అయితే యీ ప్రత్యేకమైన కేసులో ఆనందరావుగారు దోషి ఎలా కాడు అనే పాయింటుమీద ఏవైనా కొన్ని వాక్యాలు చెప్పగలరా' అన్నాడు.

'తొందర పడకు శేఖరం! నిజం నిలకడమీద గాని తేలదు. ప్రతి విషయంలోనూ మేము మీలాగే త్వరపడి ఒక నిర్ణయానికిపోయి తిరిగి వెనక్కురాము. మాకు ముందడుగే కాని వెనకడుగు లేనేలేదు. అలా ముందుకు అడుగు వేసే సమయంలో మేము కాలుమోప బోతున్న ప్రదేశం గట్టిదవునా కాదా అని నిర్ణయించుకునే రెండవపాదం తీస్తాము. అంత మాత్రం చేత మాపరిశోధనలన్నీ సరైనవే అని చెప్పటానికి వీలులేదు. సముద్ర పరిసరాలలో దొంగవూబి వున్నట్టు మొదట గట్టిగా కనుపించిన పాయింటే వాదనలో ఒక్కొక్కసారి నీటి బుడగలాగ పేలిపోవడం - దాంతో కేసు చావు దెబ్బ తినటం జరుగుతూంటుంది.' అంటూ సిగరెట్టు యాష్ట్రేలో పడేసి లేస్తూ 'సాయంత్రం - ఆనందరావుగారి యింటివద్ద కలుసు కుంటా' అంటూ ముందుకు నడచాడు.

'ఆ! అన్నట్టు మీ పిల్ల డిటెక్టివ్ ఏడి' అన్నాడు శేఖరం నవ్వుతూ.

'ఓ! పాణిమాటేనా నువ్వనేది. అతనికి యీ మధ్య పెళ్ళి సంబంధాలు చాలా జోరుగా వస్తున్నాయి. అటువంటి గిరాకీ ఏదో తగిలుంటుంది. వెళ్ళివుంటాడు. యిక పోయి వెతకాలి. మళ్ళీ నాలుగు రోజులపాటు చేతినిండా పని వుంటుందిగా!' అంటూ శేఖరాన్ని వదలి బయటకువచ్చి తన 'కంచురధం'

(డిటెక్టివ్ వామనరావు తన సీక్రట్ కౌగుకు పెట్టుకున్న ముద్దుపేరు) ఎక్కాడు.

ఆనాటి సాయంత్రం పేపర్లన్నీ - 'బీచిలో హత్య' 'సినిమానటి చిత్రకథ' 'మానం హరింపబోయి, ప్రాణం గొన్న హంతకుడు' మొదలైన రక రకాల మకుటాలతో చిత్ర విచిత్ర గతులతో చిలవలు పలవలు కల్పించి ఆనంద్ ఫైనాన్సు కార్పొరేషన్ అధినేత ఆనందరావు దుర్మార్గాన్ని ప్రకటించాయి. కొన్ని ప్రతికూలవర్గ పత్రికలు సంపాద కీయాలుకూడా వ్రాసి అయున్ను దుయ్యబట్టాయి.



ఈ సంఘటన జరిగిన మూడవ రోజున ఉదయం వామన రావు, పాణీవున్న 'కంచురథం' వచ్చి ఆనంద్ ఫైనాన్సు కార్పొరేషన్ భవనంముందు ఆగింది. గేటువద్ద కాపలావున్న గూర్ఖావచ్చి తలుపుతీసి శాల్యూట్ చేసి నిలబడ్డాడు. వామన రావు చిరునవ్వుతో గూర్ఖాని పలకరించి కారుదిగి లోనికి నడచాడు. వెంట పాణీకూడా 'టై' సర్దుకుంటూ అతనిని అనుసరించాడు.

హాలులో వారికి మేనేజర్ రాజన్ ఎదురై కరస్పర్శచేసి వారిని ఆనందరావుగారి 'Air conditioned'గదిలోకి తీసుకు వెళ్ళారు.

ఆనందరావుగారు వారిని ఆప్యాయంగా ఆహ్వానించి తన ఎదురుగా కుర్చీలుచూపి అక్కడే నిలబడ్డ రాజన్ నుద్దేశించి 'Rajan – you can go' అన్నాడు. రాజన్ వారిని వదలి బయటకు వచ్చాడు. ఆనందరావుగారి ముఖంవంక నిశితంగా చూచిన వామనరావు అందులో ఆ కేసుతాలుకు అలజడి ఛాయలు యింకా కమ్ముకునే వున్నట్టు గ్రహించాడు.

'మీ దర్శనం నిన్ననే అవుతుందనుకున్నా' అంటూ ఆనందరావు తన గోల్డు సిగరెట్ కేస్ తీసి అందులోని 'త్రీనైన్స్' వారిద్దరికి చెరొకటిచ్చి తనొకటి వెలిగించాడు.

'అవును. నేనుకూడా నిన్ననే మిమ్మల్ని కలుసుకుందామనుకున్నాను. అయితే నిన్నంతా హత్యజరిగిన ప్రదేశం పరిశీలించడంలోనూ మరికొన్ని యితరవిషయాలు ఆలోచించడంలోనూ జరిగిపోయింది. ఈరోజు మేమే వద్దామని బయలుదేరుతుండగా మీఫోన్ వచ్చింది - ఆ! అన్నట్టు మీరేదో పులిమీద పుట్రలావచ్చిపడ్డదన్నారే! ఏమిటది?' అన్నాడు వినటానికి సిద్ధంగా వున్నట్టు కళ్ళుమూసుకుంటూ వామనరావు.

ఆనందరావు ఒకక్షణం నిదానించి - 'నేను ఈ ఫైనాన్సు కార్పొరేషన్ సంస్థను ఒక సదుద్దేశంతో దాదాపు అయిదు సంవత్సరాలక్రితం స్థాపించాను. కలపవ్యాపారంలో నాకు బాగా కలసివచ్చింది. అత్యధికలాభాలు రావటంవల్ల ఆ డబ్బంతా బ్యాంకుల్లోనూ యినప్పెట్టెలోనూ మూలుగుతూ వుండటం యిష్టంలేక యీ వ్యాపారం ఆరంభించాను. మా సంస్థయొక్క ముఖ్యోద్దేశం. 'ఆశలు- ఆశయాలువుండి అవకాశాలు లేక నిరుత్సాహపడే యువవ్యాపారస్థులకు ప్రోత్సాహం యివ్వటమే.'

'ఏవిధంగానో వివరిస్తారా!' సిగరెట్ వెలిగించుకుంటూ అడిగాడు వామనరావు.
టనల

'మేము ప్రతివారం దినపత్రికల్లో చేస్తున్న ప్రక
మీరు చూడలేదా' అన్నాడు ఆనందరావు.

'అవును. ఆమధ్య ఒకసారి చూచినట్టుగుర్తు - ఆ ఫైనాన్సు కార్పొరేషన్ వారు వ్యాపారస్థులకు వడ్డీగాని మరే ఇతరజామీనుగాని లేకుండా డబ్బు అప్పుయిస్తారని చదివాను.

అది చదివి నేను కొంతవరకు ఆశ్చర్యపోయాను కూడా! నిజం చెప్పాలంటే యీమధ్య యిటువంటి ఫైనాన్సు కార్పొరేషన్లు తుక్కు-గొడుగుల్లా పుష్పవించి దరఖాస్తుదార్లు పంపిన రుసుము కైంకర్యంచేసి మాయమవుతూవుండటం మనం తరచు చూస్తూనేవున్నాము. మీ ప్రకటనలు చూచి మొదట నేనూ అలాగే అనుకున్నాను. అయితే నాకొక అనుమానం వచ్చింది. ఈవిధంగా డబ్బు పెట్టుబడిపెట్టటంవల్ల మీకు కలిగే లాభమేమిటి?' అన్నాడు వామనరావు.

'అదే మీకు చెప్పబోతున్నాను. మావద్దకు వచ్చిన ప్రతివారికీ మేము డబ్బు విరజిమ్మము. ముందుగా వారు మాకు తాము ఏఏ పద్ధతుల్లో వ్యాపారం చెయ్యదలచుకున్నారో, వారి అంచనా, లాభశాతం మొదలైన వివరాలు క్షుణ్ణంగా తెలుసుకుంటాము. తరువాత కొద్దిరోజులు మేము ఆ మనిషి నడవడికలు కీర్తిప్రతిష్టలుగురించి పూర్తిగా విచారించిగాని పెట్టుబడి పెట్టము. అలా పెట్టుబడిధనం యిచ్చినందుకు గాను లాభాలలో కొంత వాటా మేము తీసుకుంటాము. ఆ వ్యాపారస్థుడు వ్యాపారం బాగా వృద్ధిచేసుకుని తనే స్వయంగా వ్యాపారాన్ని మా పెట్టుబడిసహాయంలేకుండా నడుపుకోగల స్థితికివచ్చినపుడు వుభయుల యిష్టప్రకారం మా వాటాను కూడా అతనికే అమ్మివేస్తాము. అంతటితో ఆ సంస్థతో మాకేలాటి సంబంధం వుండబోదు. అయితే అందరికీ డబ్బు పెట్టుబడిపెట్టడం జరగదు. కొందరికి వారు సరకును తెచ్చుకునే పెద్దపెద్ద వ్యాపారసంస్థలకు మాసంస్థ వారు అరువు యిచ్చేవస్తువుల విలువకు హామీపత్రం యిస్తుంది. అంటే ఒక వేళ ఏ కారణంచేతనయినా మా తాలూకు ఖాతాదారుడు వారి సరకులసొమ్ము చెల్లించకపోయినపక్షంలో అతని తరఫున మాసంస్థ చెల్లించగలదనే హామీపత్రం (సెక్యూరిటీ బాండ్)

అన్నమాట. ఈవిధంగా హామీపత్రాలు యిచ్చే వ్యాపారస్థులలాభాల్లో మాకు వాటా వుండదు. అమ్ముడయిన సరకు యొక్క విలువమీద కొంత నిర్దిష్టమైన కమీషన్ తీసుకుంటాము. ఇన్నిసంవత్సరాలుగా వ్యాపారం సాఫీగానే సాగిపోయింది. ఉన్నట్టుండి యీరోజు ప్రమాదకరమైన స్థితి ఏర్పడింది. నిన్న 'బీచిలోహత్య' అనే శీర్షిక క్రింద పడినవార్త చదివినతరువాత చాలామంది పెద్దవ్యాపారస్థులు ఒక్కసారిగా వచ్చి మేము మా ఖాతాదార్లకు హామీవున్న సొమ్ము ఖాతాదారుడు చెల్లించలేదు, కాబట్టి వెంటనే మేము చెల్లించాలని అలా చెల్లించకపోయినపక్షంలో నామీద, కంపెనీమీద న్యాయస్థానంలో చర్యతీసుకుంటామని హెచ్చరించి వెళ్ళారు.

'నామటుకు నాకు మాసంస్థ ఆయాకంపెనీలకు ఏ ఖాతాదారుతరఫున హామీయివ్వలేదని బాగా జ్ఞాపకం. అయినా ఎందుకయినా మంచిదని 'అగ్రిమెంట్స్' అన్నీ వెతికినా ఎక్కడా ఆ కంపెనీలవారు మేము యిచ్చినట్టు చెప్పబడే 'సెక్యూరిటీబాండ్' కాపీలు కనబడలేదు. అందువల్ల నేను వెంటనే ఆయా కంపెనీలవారికి మేము వారికి ఎన్నడూ ఎవరితరఫునాకూడా హామీపత్రాలు యిచ్చివుండలేదని ఖచ్చితంగా చెప్పాము. అయితే వారు వెంటనే నేను వ్రాసి యిచ్చినట్టు చెప్పబడే హామీపత్రాలు పట్టుకుని నావద్దకు వచ్చారు. అవి సరిగా మాకంపెనీ అచ్చు హామీపత్రాలే! సంతకంకూడా నాసంతకంలాగానే వుంది. మరొక ముఖ్య విషయం ఏమంటే ఆ అగ్రిమెంట్లన్నీకూడా నేను యీ ఆఫీసుకురానిరోజుల్లో చెయ్యబడ్డవే. దాంతో నాకు మరింత అయోమయమైంది. ఒకవైపుచూస్తే నారీహత్యాపరాధం. మరొకవైపు యీతంటా. ఈవిషయంలో నాకు మీసలహా అపూర్వంగా వుండగలదని మిమ్ము పిలిపించాను. దయచేసి

హత్యారహస్యంతోపాటు యీ రహస్యంకూడా ఛేదించి పుణ్యంకట్టుకోండి' అంటూ వామనరావు రెండుచేతులూ పట్టుకున్నాడు.

వామనరావు ఆనందరావు చెప్పినదంతా శ్రద్ధగా ఆల కించి ఒక్కక్షణం కుర్చీలో చేరగిలబడి కళ్ళుమూసుకుంటూ 'ఆ! కానీ' అన్నట్టు పాణీ వంక చూచాడు.

పాణి గొంతు సవరించుకుంటూ - 'అయితే ఆ అగ్రి మెంట్లన్నీ మీరు ఆఫీసులోలేనికోజుల్లో జరిగాయంటు న్నారే. ఆయా తేదీలలో మీరెక్కడున్నారో చెప్ప గలరా?' అన్నాడు ఆనందరావుతో.

తన మనస్సులోని ప్రశ్న ఖచ్చితంగా అడిగినందుకు వామనరావు పాణిని మెచ్చుకుంటూ అతనివంక ఆప్యా యంగా చూచాడు.

ఆనందరావు పూర్తిగా ఒక్కనిముషం మౌనంగా వుండి తలవంచుకుని - 'క్షమించండి! ఆ ఒక్కవిషయంమాత్రం మీకు చెప్పలేను. కాని ఆయా తేదీలలో నేను యీ ఆఫీ సులో లేననిమాత్రం ఖచ్చితంగా చెప్పగలను' అన్నాడు.

పాణి చిరునవ్వుతో వామనరావువంక చూచి-'పోనీ మీరు డబ్బుచెల్లించాలని 'డిమాండ్' చేస్తున్న ఆయా కంపెనీల పేర్లు పూర్తిగా వ్రాసి ఒక లిస్టు తయారుచేసి యిస్తారా' అన్నాడు.

వామనరావు యీ ప్రశ్నకుకూడా తన ఆమోదానందాలు తెలుపుతూ తల వూపాడు.

ఆనందరావు బల్లమీదనున్న కాలింగ్ బెల్ నొక్కాడు. తక్షణం తలుపు తెరచుకుని రాజన్ ప్రత్యక్షమయ్యాడు. ఆనంద రావు అతనితో వామనరావు కోరినలిస్టు తయారుచేసి

యిమ్మని చెప్పాడు. మరుక్షణం తలుపు తెరచుకుని రాజన్ బయటకు వెళ్ళిపోయాడు. రాజన్ వెళ్ళినవంకే చూస్తూ వామనరావు - 'ఆనందరావుగారూ! యీ రాజన్ చాలా శ్రద్ధగా పనిచేస్తాడనుకుంటాను' అన్నాడు.

'అవునండీ! చాలా శ్రద్ధాభక్తులతో చేస్తాడు. యీ అయిదు సంవత్సరాలుగా నా దగ్గరే పనిచేస్తున్నాడు. నిజం చెప్పా అంటే యీ నాడు ఫైనాన్స్ కార్పొరేషన్ యింత ఉన్నత స్థితి నందుకుందంటే అందుకు మా రాజనే పూర్తిగా కారకుడు' అన్నాడు. ఆయన కనులు కృతజ్ఞతా సూచకంగా మెరిశాయి.

'ఓహో!' అంటూ పాణి వామనరావు వంక చూచి నవ్వాడు. 'వూరుకో' అన్నట్టు సంజ్ఞ చేసాడు వామనరావు.

'May I come in please' అంటూ లోనికి వచ్చిన రాజన్ ఒక టైప్ చేసిన కాగితం ఆనందరావుగారి బల్లమీద వుంచాడు. ఆనందరావు దానిని తానొకసారి తేరిపార చూచి వామనరావు చేతికి అందించాడు.

వామనరావు ఆ కాగితం పరీక్షగా చూస్తూ - 'వీరందరూ మీ నుంచి రాబట్టజూస్తున్న డబ్బు మొత్తం ఎంత?' అన్నాడు.

'ఆరు లక్షల అరవై వేలు' ఆనందరావుగారు బదులు చెప్పే లోగా రాజన్ సమాధానం చెప్పాడు.

ఆనందరావువద్ద శెలవు తీసుకుంటూ వామనరావు 'బహుశ నేను మిమ్ము ఒకటి రెండురోజుల్లో కలుసుకుంటాను. అంత వరకూ మీరు మరే యితర కాంట్రాక్టులమీదా సంతకం పెట్టకండి' అంటూ బయటకువచ్చి కంచురథ మెక్కాడు. వెంటనే ఆ రథం పారిస్ కార్నర్ వైపు వేగంగా సాగి పోయింది.

# 3

ప్రాణి కారును ది న్యూబాంబే పెన్ మాన్ఫాక్చరింగ్ కంపెనీ ఎదుటనిలపాడు. వామనరావు నిదానంగా కారుదిగి పాణిచెయ్యి పుచ్చుకుని లోపలికి నడిచాడు. అక్కడ వున్న రిసిప్షన్ క్లర్క్కి తన కార్డు అందించాడు. అతను వెంటనే లోనికిపోయి తిరిగివచ్చి డిటెక్టివ్ లిద్దరినీ లోపలకు తీసుకు పోయాడు.

ఆ సంస్థ యజమాని అబ్దుల్ మజీద్ భాయ్ వామనరావు, పాణిలను ఆహ్వానించి కుర్చీలు చూపుతూ - 'యింతవరకు మీ పేరు వినటమే తప్ప ఎన్నడూ దర్శనం చేసుకోలేదు. అది యీ నాడు లభ్యమైంది. చాలా సంతోషం 'స్నేహభావం వుట్టిపడుతూ అన్నాడు.

వామనరావు నవ్వుతూ - 'చూడండి మజీద్ భాయ్! మీకు ఆనంద్ ఫైనాన్సు కార్పొరేషన్ వారు ఒక ఖాతా దారుని తరఫున హామీపత్రం యిచ్చినట్టు, ఆ ఖాతాదారుడు మీ వద్ద సరుకు డెలివరీ తీసుకుని డబ్బు కట్టకపోవటంతో మీకు ఆ డబ్బును ఆనందరావుగారి వద్దనుంచి రాబట్ట జూస్తు న్నట్టు ఆయన చెప్పారు. అయితే ఆ ఖాతాదారుని పేరు కొంచెం తెలియపర్చగలరా?' అన్నాడు.

అబ్దుల్ మజీద్ ఒకసారి తన అందమైన గడ్డం సవరించు కుంటూ వామనరావువంక నవ్వుతూ చూచి - 'అయితే మీరు మాకు ప్రతికక్షులన్నమాట! సరే, మాకు మీ మీదుండే గౌరవంవల్ల ఆ పత్రం మీకు చూపిస్తాను. కాని మీ క్లైంటు అబద్ధాలాడి ఆ పత్రం తాను వ్రాసియిచ్చింది కాదంటూ సొమ్ము ఎగవెయ్య జూస్తున్నట్టు బాగా నమ్మకం కలిగింది. మావద్ద ఆ పప్పులు వుడకవని మీరు మా తరఫున ఆయనతో గట్టిగా చెప్పండి' అంటూ డ్రాయరు తెరచి, అందునుంచి

పెద్ద ఫైలు బయటకు తీసి, దానినుండి ఒక హామీపత్రంతీసి వామనరావు ముందుంచాడు.

ఆ హామీపత్రం వరదరాజులు అనే ఒక చిన్న పెన్నుల వ్యాపారస్థుని తరఫున ఆనంద్ ఫైనాన్స్ కార్పొరేషన్ వారు ది న్యూబాంబే పెన్ మాన్‌ఫేక్చరింగ్ వారికి వారు వరదరాజులుకు సప్లయి చెయ్యబోయే సరకు మొత్తం విలువను వరదరాజులు చెల్లించని పక్షంలో తాము చెల్లించగలమని వ్రాసి వుంది. క్రింద వున్న సంతకాన్ని వామనరావు తనవద్దనున్న ఆనందరావు సంతకంతో పోల్చిచూచాడు. రెంటికీ ఎంతమాత్రం తేడా కనుపించలేదు. పూర్తిగా కెమికల్, మైక్రోస్కోపిక్ పరీక్షలు చేసిగాని ఏ విషయం నిర్ణయింప వీలుగానంత పోలికలున్నై. వామనరావు తిరిగి ఆ హామీ పత్రాన్ని మజీద్‌కియిచ్చి అతని సహాయానికి కృతజ్ఞత తెలియబరచి బయటవున్న కారెక్కి కోడంబాకం వైపు బయలుదేరాడు.

కోడంబాకం యునైటెడ్ కాలనీపక్కగా వున్న సందు మొదట్లో తమ కారును ఆపి వామనరావు, పాణి కలసి కాలి నడకను కొంతదూరముపోయి 26వ నెంబరు యింటిముందు నిలచి తలుపు తట్టారు. లోపలనుంచి అరవంలో 'ఎవరు' అని ఒక స్త్రీ కంఠం వినిపించింది. 'వరదరాజులున్నాడా?' అని పాణి అరవంలోనే ప్రశ్నించాడు. ఒక్క నిముషంపాటు నిశ్శబ్దం. తరువాత లోపలనుంచి ఎవరో గుసగుసలాడిన ధ్వని, అడుగుల చప్పుడు వినిపించాయి. మరొక నిముషం తరువాత లుంగీ, బనీనులోవున్న లావాటి కోరమీసాల వ్యక్తి వచ్చి కొద్దిగా తలుపు తెరచి ఎదురుగా సూటులోవున్న యిద్దరు వ్యక్తులనుచూచి తలుపు బిగించబోయాడు. పాణి మెరపులా ఎగిరి అమాంతం ఒక్క తోపు తన్నాడు. అలావాటి వ్యక్తి

వెనక్కు పడిపోయాడు. వామనరావు లోపలికి ప్రవేశించి ఆ వ్యక్తి లేవకుండా పట్టుకున్నాడు. అతను తప్పించుకునేందుకు పెనుగులాడగా - 'అనవసరంగా పెనుగులాడకు. నీ బండారం బయటపడింది. అసలు విషయం నాకు చెపితే నీకు శిక్షపడకుండా కాపాడగలను. పారిపోవటానికి ప్రయత్నించకు. నీ యింటిచుట్టూ రెండు డజన్ల మంది రిజర్వు పోలీసులు విచ్చుకత్తులతో పహరా కాస్తున్నారు' అన్నాడు తీక్షణంగా.

పోలీసుల పేరు వినగానే ఏనుగులావున్న ఆ వ్యక్తి అమాంతం వామనరావు పాదాలమీద పడి - 'నన్ను కాపాడండి! నేను చేసినదంతా చెపుతాను' అన్నాడు.

'అయితే చెప్పు! నువ్వు తెచ్చిన పదిహేను వేలు విలువగల పెన్నులు ఎక్కడ పెట్టావు?' వామనరావు తీక్షణంగా అడిగాడు.

'అమ్మేసాను'

'ఎప్పుడు - ఎక్కడ?'

'మద్రాసులోనే వేలంలో అమ్మాను'

'వేలంలోనా! అంటే అసలుకన్న తక్కువ ధరకు అమ్మారన్నమాట. మొత్తం ఎంత సొమ్ము వచ్చింది.'

'ఎనిమిది వేల రూపాయలు. అందులో నావాటా రెండు వేలూ తీసుకుని మిగతా ఆరు వేలూ ఆయనకిచ్చాను'

'ఆయనెవరు?'

'ఆయనే బాబూ! ఆనందరావుగారు'

వామనరావు తీక్షణంగా అతనివంకే చూస్తూ 'వరదరాజులూ! ఒక తప్పుచేసి మరొకతప్పు చెయ్యడానికి ప్రయత్నించకు.

నువ్వు నిజంగా డబ్బు ఎవరికిచ్చావు? అసలు యీ పనికి నిన్ను పురికొల్పిందెవరు?' అన్నాడు.

'లేదు బాబూ! నేనబద్ధం ఆడటం లేదు! అసలు నాకేమీ తెలియదు. ఏదో సెకండు హాండ్ పెన్స్ రిపేరు చేసుకుని దొరికినదాంతో హాయిగా కాలక్షేపం చేస్తూ వుండేవాడిని. ఒకరోజు పాండీబజార్లోని నా చిన్న అంగడి మూస్తూ వుండగా ఒకతను త్వరత్వరగా నావద్దకువచ్చి 'వరదరాజులు నువ్వేనా?' అన్నాడు. నేను అవునన్నాను. 'అయితే రేపు ఉదయం పదకొండు గంటలకు ఆనందరావుగారిని వారి ఆఫీసులో కలుసుకో' అని చెప్పి ఆనంద్ ఫైనాన్సు కార్పొరేషన్ అడ్రసు యిచ్చి త్వరత్వరగా వెళ్ళిపోయాడు. నాకు నిజంగా ఆశ్చర్యం వేసింది. అంత గొప్పవారికి నాతో ఏం పని వుంటుందా అని ఆలోచించుకుంటూ మర్నాడు పదకొండు గంటలకు వారి ఆఫీసుకు వెళ్ళాను. అంతకు ముందు రోజు నా వద్దకు వచ్చిన వ్యక్తి ఎదురుపడి లోపలికి తీసుకుపోయాడు. అక్కడ ఆనందరావుగారు ఆదరంగా ఆహ్వానించి నాతో యీ విషయం ప్రస్తావించారు. నేను చెయ్యవలసిందల్లా నే నొక పెన్నుల వ్యాపారస్థుడనని నాకు సరుకు అప్పు కావాలని ఒక దరఖాస్తు ది న్యూ బాంబే పెన్ మాన్ ఫాక్చరింగ్ వారికి పంపుకోవటం నా దరఖాస్తుతోపాటు సొమ్ముకు హామీగా ఆనంద్ ఫైనాన్స్ కార్పొరేషన్ వారి హామీ పత్రం జతపరచటం. సరకు డెలివరీ తీసుకుని దానిని అయినకాడికి వేలంలో అమ్మి, వచ్చిన సొమ్ములో నాలుగోవంతు నేను కమీషన్ తీసుకుని మిగిలిన మూడు వంతులు ఆనందరావుగారికి యివ్వటం. ఇదీ వారు నాకు యిచ్చిన సూచన. ఇందులో నా కెంతమాత్రం ప్రమాదం రాదని, ఒకవేళ అటువంటి దేదయినావస్తే వాటన్నిటిని తాను సర్దుకుంటానని హామీ

యిచ్చారాయన. వెంటనే వారు ఆయన హామీపత్రం కూడా యిచ్చారు. నేను బాంబే పెన్ కంపెనీవారి వద్ద ఆనంద్ ఫైనాన్సు కార్పొరేషన్ వారి హామీ పత్రం ఆధారంగా సరకు తెచ్చి అనుకున్న ప్రకారం వేలంలో అమ్మి వచ్చినడబ్బులో నా వాటా తీసుకుని మిగిలినది ఆయనకిచ్చాను. నేనుగా తీసుకున్న సరుకుకు డబ్బు చెల్లించలేను కనుక ఏ క్షణాన్నయినా ఆ కంపెనీవారు నా యిల్లు ముట్టడిస్తారని తెలుసు. అందుకే దొరికిన రెండు వేలూ తీసుకుని యీ రాత్రికే మధురకు పారిపోయి అక్కడ మారుపేరుతో వ్యాపారం ప్రారంభించాలని నిశ్చయించుకున్నాను. ఇంతలోనే మీరు నన్ను కనిపెట్టారు. బాబూ! పిల్లలు కలోణ్ణి మీరు నన్ను కనికరించాలి' అంటూ వరదరాజులు వామనరావు కాళ్లు పట్టుకున్నాడు.

వామనరావు అతన్ని లేవదీసి - 'చూడు వరదరాజూ! నిజంగా నువ్వు చాలా పెద్దతప్పుచేసావు. నువ్వు పారిపోయావంటే దానికి తోడు మరొకతప్పు చేస్తున్నావన్నమాట. అందువల్ల నువ్విలాంటి పిచ్చిపనులు చెయ్యక, నాకు చెప్పినదంతా ఓ స్టేట్‌మెంటు వ్రాయించి పోలీసువారికి యిద్దాం - అది సరేగాని నువ్వు ఆనందరావుగార్ని కలుసుకుని హామీ పత్రం తెచ్చుకున్న తేదీ జ్ఞాపకం వుందా' అన్నాడు.

వరదరాజులు ఒక్కక్షణం యోచించి 'ఆరోజు ఏప్రిల్ యిరవై యొకటి. ఆ రోజు మా అమ్మాయి పుట్టినరోజు అవటంవల్ల నాకు బాగా జ్ఞాపకం' అన్నాడు.

వామనరావు వరదరాజులు పారిపోయేందుకు యత్నిస్తే కఠినశిక్ష పడుతుందని హెచ్చరించి పాణితోసహా బయటపడి సందు కొందట వున్న తన కంచురథ మెక్కాడు.

# 4

'అయితే ఏప్రిల్ యిరవై రొక్కటిన మీరు ఆఫీసులో లేనంటారు! అంతేకదూ?' ఆనంద్ రావుగారి ఎదుట కుర్చీలో కూర్చున్న వామనరావు అడిగాడు.

'ఖచ్చితంగా లేను. పంతొమ్మిదో తేదీ సాయంత్రం నుంచీ యిరవై మూడో తేదీ పుదయంవరకూ నేను 'టూర్'లో వున్నాను' నమ్మకంగా చెప్పాడు ఆనందరావు.

'ఏ వూరిలో వున్నారు.'

'దయుయుంచి ఆ విషయం మాత్రం అడగవద్దని ప్రార్థన. నేను ఎక్కడున్నదీ ఎవరికీ తెలియపరచనని మరొకవ్యక్తికి వాగ్దానం చేసాను.' తల వంచుకు సమాధానం చెప్పాడు ఆనందరావు.

'చూడండి! ఆనందరావుగారు! ఒక వైపు మీ వ్యాపారం, మీ పరువు, కీర్తి, ప్రతిష్ట భంగమయ్యే పరిస్థితికి వచ్చింది. అటువంటి సమయంలో మీరు యిటువంటి విషయాలు మీ శ్రేయోభిలాషి నయిన నావద్దకూడా దాచటం అంత మంచిది కాదు. మీరు గనుక ఆయా అగ్రిమెంట్లు జరిగిన తేదీలలో యీ వూరిలో లేనని ససాక్ష్యంగా ఋజువు పరచుకున్నట్టయితే మీ మీద కొన్ని కంపెనీలు తెచ్చిన కేసులు ఉఫ్ అంటూ ఎగిరిపోతాయి. అందువల్ల నా మాట విని నిజం చెప్పండి' సలహా యిస్తున్నట్టు చెప్పాడు వామనరావు.

'నా వ్యాపారమంతా నాశనమైపోయినా, నేను జైలుకు వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడినా వాగ్దాన భంగం మాత్రం చెయ్యదలుచుకోలేదు' నిశ్చయంగా అన్నాడు ఆనందరావు.

వామనరావు లేస్తూ - టేబిల్ పైన హేట్ చేతిలోకి తీసుకుని రెండడుగులు ముందుకువేసి ఆగి, వెనక్కు తిరిగి ఆనంద

రావువంక చూస్తూ 'ఆనందరావుగారూ బాగా ఆలోచించు కోండి - మీ ఆదర్శాలకు కట్టుబడి సర్వనాశనమే కోరు కుంటారో! లేక ఆయా తేదీలలో మీరు ఎక్కడున్నదీ నిజం చెప్పి పరువు, ప్రతిష్టలు కాపాడుకుంటారో నిర్ణయించు కోండి. ఆఁ! అన్నట్టు రేపేకదూ ఫస్టు హియరింగ్ మిమ్మల్ని కోర్టులో కలుసుకుంటాను' అంటూ ఆనందరావుగారి సమా ధానం కోసమైనా నిలవకుండా చకచకా అడుగులు వేస్తూ గ్లాస్‌డోర్ దాకా వచ్చిన వామనరావు తలుపు బయటనుంచి ఒకవ్యక్తి గబ - గబా అడుగులు వేసుకుంటూ పోతున్నట్టు అద్దంలోంచి గమనించి ఒక్కక్షణం నిదానించి తలుపు తెరచి బయటకువచ్చాడు. ఆ హాల్లో ఒకమూల లేడీస్టెనో తల వంచు కుని కాగితాలు టైపుచేసుకు పోతూంది. మరొక వంక రాజన్ తన కుర్చీమీద ఒక కాలుంచి మరొక కాలు గోడకు పోటీగాపెట్టి నిలచి ఆఫీసు కిటికీనుంచి సముద్రగర్భంలో జారబడుతున్న అస్తమయ సూర్యబింబంవంక రెప్ప వాల్చ కుండా చూస్తూ నిలబడ్డాడు. వామనరావు ఒక్క నిముషం ఆ పరిసరాలు నిదానంగా పరీక్షించి అడుగులో అడుగు వేసు కుంటూ రాజన్ టేబిల్‌వద్దకు పోయి, 'మిస్టర్ రాజన్!' అన్నాడు.

ప్రకృతి సౌందర్యం వీక్షించడంలో లీనమైన రాజన్‌కి డిటెక్టివ్ పిలుపు వినబడలేదు.

వామనరావు రాజన్ టేబిల్‌పైన వున్న గంట టంగ్‌మని వేస్తూ 'రాజన్!' అన్నాడు.

ఉలికిపడి వెనుదిరిగిన రాజన్ వామనరావువంక అదో మాదిరిగా చూస్తూ 'ఓ! ఐ యామ్ సారీ సార్! పిలిచారా?' అన్నాడు.

'ఆఁ, ఏమంత పెద్దపని లేదు. అయితే మీరు భావకవులా ఏమిటి కొంపతీసి' నవ్వుతూ అన్నాడు వామనరావు.

'అంత పెద్దమాటకు అర్హుడిని కాను. అయినా పూర్వా శ్రమంలో నేను కొన్ని నాటకాలు రచించాను. వాటిలో కొన్నిటిని దిగ్విజయంగా ప్రొడ్యూస్ చేసాను కూడా! చూడండి! అటు చూడండి! ఆ అస్తమయ సూర్యుని అరుణ కాంతిలో, ఆ సముద్రకెరటాలు వెండిలా ఎలా తళతళా మెరసిపోతున్నాయో! దూరంగా చూడండి ఆ ఓడవస్తూంది కనిపిస్తుందా! యీ దృశ్యం ఎంత మనోహరంగా వుంది. చిత్రకారు డయినవానికి యింతకన్న మంచి సబ్జక్టు దొరకు తుందా చిత్రించడానికి...' అంటూ దీక్షగా అట్టే చూడ సాగాడు.

వామనరావు ఒకక్షణం నిదానించి 'మిస్టర్ రాజన్! మీరు నిజంగా అదృష్టవంతులు. అందుకనే ప్రకృతి రామణీయ కతను అంతగా ఆస్వాదించగలుగుతున్నారు. మాకు అస్త మయ సూర్యుని అరుణకాంతిలో ఎన్నో వేల మంది హంత కులు, హతులు తప్ప వేరెవ్వరూ కనిపించరు. అరె! అరు గంటలైందే! మీరు రోజూ యింతవరకూ పనిచేస్తుంటారా!' అన్నాడు.

రాజన్ నవ్వుతూ 'అవునండి. ప్రతిరోజూ యీ అస్తమయ సూర్యుని అందం తిలకించి ఆతను పూర్తిగా సముద్రగర్భం లోకి చొచ్చుకుపోయిన తరువాత వెళ్ళిపోతూ వుంటాము' అన్నాడు.

వామనరావు రాజన్‌వద్ద శెలవు తీసుకుని బయటకువస్తూ వెనక్కు తిరిగి చూచాడు. రాజన్ నిశ్చలంగా ఆ దృశ్యం చూస్తూవుండటం గమనించి బయటకు వెళ్ళిపోయాడు.

# 5

'అయితే బాస్! ఈ కేసులో నీకేమయినా తొండేమేదో, తలఏదో నిర్ధారణ అయిందా! నామటుకు నాకు అంతా అగమ్య గోచరంగా వుంది' అన్నాడు పాణి కంచురథాన్ని మెరీనా బీచిలో ఆపుతూ.

పాణి తీసిన తలుపును తిరిగి మూస్తూ వామనరావు 'వద్దు పాణి కొంచెం యిక్కడే కారులోనే కూర్చుందాం.' అన్నాడు.

తను అడిగిన ప్రశ్నకు సరైన సమాధానం రాకపోవటంతో పాణి సీటుకు చేరగిలబడి 'డీలక్స్' సిగరెట్ అంటించి కారులోవున్న రేడియో 'ఆన్' చేశాడు. సిలోన్ నుంచి హిందీ చిత్ర సంగీతం ప్రసారమవుతోంది. మెల్లగా వింటూ కళ్ళుమూసు కున్నాడు పాణి.

'పాణీ! లే! త్వరగా స్టార్టు చెయ్యి. ముందు వెళుతున్న ఆ ఆకుపచ్చ 'వాక్స్ హాల్' టాక్సీని వెంబడించు వారికి అనుమానం కలగనివ్వద్దు' అంటూ ఆతుర్దాగా వామనరావు జారిచేసిన హుకుంతో పాణి మానవ ప్రపంచంలోపడి కంచు రథం స్టార్టు చేసి ముందు పోతున్న ఆకుపచ్చ టాక్సీ వెంబడించాడు. ఒక ఫర్లాంగు ఎడంలో రెండు కార్లు జోరుగా పోతున్నాయి. ముందు పోతున్న టాక్సీ వి. జి. ఆఫీస్ పక్క నుంచి ఇలియట్సు రోడ్డుగుండా ప్రయాణించి మీర్సా పేటలో ఒక యింటిముందు ఆగింది. వెంకటాచల మొదలివీధిలోంచి జగదాంబాళ్ కాలనీ పక్కగా తమ కంచురథాన్ని ఆపి మీర్సా పేటనుంచి తిరిగివచ్చే టాక్సీకోసం రోడ్డుమీద నిల బడ్డాడు పాణి.

పాణి చెయ్యి అడ్డం పెట్టగా వేగంగా వస్తున్న టాక్సీ కీచుమంటూ ఆగింది. వెంటనే వామనరావు టాక్సీ మనిషికి తన అధారిటీ పత్రం చూపిస్తూ 'నువ్వు యిప్పుడు సవారీ వది లిన యింటి నెంబరెంత?' అన్నాడు.

టాక్సీవాడు ఒక్కనిముషం నిదానించి పాణి చేతులో రెప రెప కొట్టుకుంటున్న అందమైన కొత్త పదిరూపాయల నోటు వంక చూస్తూ- 'రెండు వందల యాభైయెనిమిదీ ఎఫ్' అన్నాడు.

'సరిగా చూసావా!' అన్నాడు పాణి.

'గేటుమీద యిత్తడి అంకెలె వున్నాయి సార్' అన్నాడు టాక్సీవాడు నోటు అందుకుంటూ.

'సరె యిక నువ్వెళ్లు' అన్నాడు పాణి! ముందుకు సాగి పోయింది టాక్సీ. వెంటనే పాణి టాక్సీ వెనకాల నున్న నెంబర్ ప్లేట్ వంక దీక్షగా చూస్తూ జేబునుండి నోట్ బుక్ తీసి అందులో నోట్ చేసుకున్నాడు. అతని సమయస్ఫూర్తికి మెచ్చుకుంటున్నట్టుగా వామనరావు అతని భుజంమీద ఆప్యా యంగా తట్టాడు.

అజంతాలో కాఫీ తాగిన వామనరావు, పాణీలు ఒక పది నిముషాల తరువాత తమ కారును అక్కడే వదిలి కాలి నడకను మీర్సాసేటకు బయలు దేరారు.

టాక్సీ మనిషి చెప్పిన నెంబరు యింటి ముందు నిలచి పరిసరాలు ఒక్కసారి పరికించి వామనరావు పాణికి సంజ్ఞ చెయ్యగా పాణి తలుపులు తట్టిన వెంటనే లోపలనుంచి టక టక పావుకోళ్లు ధ్వనిస్తూ కాషాయరంగు పంచ, అదే ఉత్తరీయంలో వున్న వ్యక్తివచ్చి తలుపు తెరచి ఎదుట కన బడిన యిద్దరినీ చూచి ఒక్కక్షణం విస్మయపడి దానిని బయట పడనీయక చిరునవ్వుతో 'అహాహా! వామనరావు

గారా! ఎంత అదృష్టం. యీ పేదవానిమీద మీరు యింత కృపాకటాక్షవీక్షణం......'అంటుండగా వామనరావు అడ్డు పడి 'అబ్బే అదేమీ లేదు మిష్టర్ రాజన్! మీతో కొంచెం పని వుండి వచ్చాను. అభ్యంతరం లేకపోతే ఒకటి రెండు ప్రశ్నలడుగుతాను సమాధానం చెపుతారా?' అన్నాడు.

'అంతకన్న నా! సంతోషంగా! దయచెయ్యండి. యీ సోఫాలో కూర్చోండి' అంటూ సోఫాచూపి 'గౌరీ! రెండు కాఫీ పట్టుకురా' అన్నాడు రాజన్.

'అబ్బే వద్దండి. యిప్పుడే అజంతాలో స్పెషల్ కాఫీ తాగొచ్చాం' అంటూ వామనరావు సిగరెట్టు ముట్టించి 'అయితే మిష్టర్ రాజన్! మీ యజమాని ఆనందరావుగార్ని గురించి మీ అభిప్రాయం తెలుసుకోవాలని వచ్చాను. కొంచెం వివరంగా చెప్పగలరా' అన్నాడు.

'ఆ విషయం మీరు నన్ను అడిగితే ఏం చెప్పాలో అర్థం కావటం లేదు. ఆయన్ని తలుచుకున్నప్పుడల్లా నా లోని ప్రతి నరం ఆయనపట్ల కృతజ్ఞత సూచిస్తుంది. వూరు, పేరు లేక ఏదో నాటకాలు రాసుకునే నాబోటివాడ్ని తీసుకు వచ్చి యీ వున్నతపదవి యిచ్చి అనుకున్నదానికన్న ఎక్కువ ముట్టచెప్తూ అత్యంత ఆదరంగా చూస్తున్న ఆనందరావు గారి మంచిని గురించి ఎన్ని రాత్రులు, పగలు చెప్పుకున్నా తరగదు. ఆయనంత మంచివారు ఆయనే కాని మరొకరు లేరు. నా దృష్టిలో ఆయనొక దేవుడు' అంటూ ఆనందంతో స్వరం గద్గదమవగా రాజన్ కళ్ళు తుడుచుకుంటూ - 'జై శ్రీ సాయిబాబా వారిని సర్వకాల సర్వావస్థల్లోనూ సుఖంగా బ్రోచుగాక - ఆయనమీద లేనిపోని నారీహత్యాపరాధం మోపబడిన రోజు నేనెంతగా విలపించానో ఆ సాయిబాబాకే ఎరుక. ఆ సాయిబాబాయే మీలో ప్రవేశించి, మీ ద్వారా

ఆయనను విడుదల చేసారేమో ననిపిస్తూంది' అంటూ తిరిగి కళ్ళు తుడుచుకున్నాడు రాజన్.

పాణి అతని మంచితనం చూచి గౌరవపూర్వకంగా అతని వంక చూస్తూ 'మీది చాలా సుతిమెత్తని మనస్సు' అన్నాడు.

వామనరావు మాటమారుస్తూ - 'అయితే నెల కొకసారి ఆనందరావుగారు గ్రామాంతరం వెళ్ళి నాలుగయిదు రోజులు వుండి వస్తారని, అటువంటి సమయాల్లోనే యీ బోగస్ అగ్రిమెంట్లు సృష్టింపబడ్డవని ఆయన చెపుతున్నారు. ఆయన ఏవే చోట్లకు వెడతారు. ఆయన గైర్‌హాజరీల్లో ఆ కార్యక్రమాన్ని ఎవరు నిర్వహిస్తారో కూడా చెప్పగలరా?' అన్నాడు.

రాజన్ ఏదో చెప్పటానికి సందేహిస్తున్నట్టు గ్రహించి వామనరావు - 'రాజన్! యిదంతా నేను మన ఆనందరావుగారి మంచికే అడుగుతున్నాను. మీకు తెలిసిన విషయం ఏమయినావుంటే అది నాకు చెప్పండి. తద్వారా మీరు ఆనందరావుగారికి ఎంతో మేలుచేసిన వారవుతారు' అన్నాడు.

రాజన్ కళ్ళు తుడుచుకుంటూ 'నాకు అంతకన్న కొంచెం సిందిమాత్ర మేముంది. జై శ్రీ సాయిబాబా! అసలు ఆనందరావుగారి ప్రవర్తన ఒక సంవత్సరంగా కొంత మారినట్టు కనపించసాగింది. ఉన్నట్టుండి ఒకరోజు సాయంత్రం నన్ను తమ గదిలోకి పిలచి 'చూడు రాజన్! నేను రేపు బిజినెస్ టూర్ మీద వెడుతున్నాను. అయితే నువ్వుమాత్రం నేను ఆఫీసులో లేనట్టు ఎవరికీ తెలియపర్చరాదు. తెలిసిందా! ఇంటికి ఫోన్‌చేసి నేను యిక్కడే వున్నట్టుగా ఆఫీసుపనివల్ల తీరికలేదని చెప్పి భోజనం కారియర్‌లో యిక్కడికి తెప్పించి దానిని శుభ్రంగా నువ్వే భోంచేసి ఖాళీకారియర్ యింటికి పంపుతూవుండు. జాగ్రత్త! నేను ఆఫీసులో లేనట్టు ఎవరికీ అనుమానం కలగకుండా చెయ్యాలి. తెలిసిందా?' అన్నారు.

నేను సరేనన్నాను. మర్నాడు మామూలు ప్రకారం ఆఫీసుకు వెళ్ళాను. పదకొండు గంటలకల్లా ఆనందరావు గారు టాక్సీలో ఆఫీసుకు వచ్చారు. నేను ఆశ్చర్యపోయాను. వూరు వెళతానన్నవారు వెళ్ళకపోవటం, అందులో నాలుగు రోజులుండగా టాక్సీలో రావడం రాగానే మామూలుగా నా టేబిల్ ముందు ఒకటి రెండు నిముషాలు నిలబడకుండా సరాసరి తన గదిలోకి వెళ్ళటం యివన్నీ ఆలోచించుకుంటూ నేను అయిదు నిముషాల తరువాత వారి గదిలోకి వెళ్ళి 'ఏం సార్! టూర్‌కి వెడతామన్నారు. వెళ్ళలేదా?' అని ప్రశ్నించాను. ఆయన కోపంగా నా వంకచూస్తూ 'రాజన్ అధిక ప్రసంగం చెయ్యక, వెళ్ళు! నేనునా యిష్టంవచ్చినట్లు చేస్తాను. నువ్వెవరివి అడగటానికి? వెళ్ళి, యింటికి ఫోన్ చేసి అన్నంపంపమని చెప్పి నువ్వు యింటికెళ్ళు. యిక యీరోజు నీతో ఏం పనిలేదు' అన్నారు. నేను ఆశ్చర్యపోయాను. ఎన్నడూ పల్లెత్తు మాటయినా అనని ఆనందరావు గారు యీనాడు యింత విసుక్కోటానికి కారణం బోధపడలేదు. అయినా ఆయన ఏం చిక్కులో వున్నారో అనుకుని మాట్లాడకుండా గదినుండి బయటకువచ్చి, భోజనం పంపమని వారింటికి ఫోన్ చేసి నేను బయటకు వెళ్ళిపోయాను. ఈ విధంగా ప్రతినెలా జరుగుతూనేవుంది. అయితే ఆ నాలుగురోజులూ ఆయన ఈ ప్రపంచంతో విసిగి ఏకాంతవాసం గడుపుతున్నారేమో అని సరిపెట్టుకు వూరుకున్నాను. అంతేకాని ఆనందరావుగారన్నట్టు ఆయన యీ వూరువదలి ఎక్కడకూ వెళ్ళలేదని, ఖండితంగా చెప్పగలను' అన్నాడు.

'మరి నాతో అంత ఖండితంగా తను ఆ బోగస్ అగ్రిమెంట్లు జరిగినపుడు వూరిలో లేనని చెపుతున్నాడే' అన్నాడు వామనరావు.

రాజన్ కొద్దిగా నవ్వి 'అవి అసలు బోగస్ అగ్రిమెంట్లు కావని, జెన్యూన్ అనే నా భావన' అన్నాడు.

పాణి తెల్లబోతూ 'వా...ట్...!' అన్నాడు.

వామనరావు కొంచెం తీక్షణంగా 'అయితే మీరు ఆనంద రావుగారి మంచితనాన్ని శంకిస్తున్నారన్నమాట. ఒక్క క్షణంముందు మీరు చెప్పిన మాటలకు ఈవిషయం పూర్తిగా వ్యతిరేకంగా లేదూ' అన్నాడు.

'క్షమించండి. ఆయన మీద నాకన్నడూ పూజ్యభావం తప్ప మరొకటి లేదు. నిజం చెప్పాలంటే మీరు బలవంతం చేసి నానోటి మీదుగా యీ విషయాలన్నీ ఆయన శ్రేయస్సు కోసం అంటూ చెప్పించారు' అంటూ వామనరావుకే ఎదురు దెబ్బ కొట్టాడు.

పాణి ఏదో అనగా వామనరావు వారించి 'అయితే ఒక వేళ కోర్టులో మీసాక్ష్యం అవసరమైతే మీరు యీ విష యాలన్నీ చెపుతారా?' అన్నాడు.

రాజన్ నవ్వుతూ - 'డిటెక్టివ్ సాబ్! ఆనందరావుగారు యిలా చెయ్యడంలో వారి ఉద్దేశం ఏమైనా కావచ్చు. అంత మాత్రం చేత నేను వారికి విరుద్ధంగా సాక్ష్యం యిస్తానను కోవటం పొరపాటు. నా కంఠంలో ప్రాణ ముండగా యింకొకరినుండు యీ విషయాల్లో పూచికపుల్ల కూడా బయలు పెట్టను' అన్నాడు.

ఇంతలో లోపలినుంచి పద్దెనిమిది, యిరవై సంవత్సరాల అందాల రాసిగా పేర్కొన దగిన సుందరి మూడు వెండి గ్లాసులనిండా కాఫీపోసి వెండి పళ్ళెంలోవుంచి తెచ్చి వారి ముందు వుంచింది. 'ఈమె మా చెల్లెలు గౌరి. ఇంటర్ వరకు చదివింది' అంటూ రాజన్ గౌరిని వారికి పరిచయం చేసాడు. ఆమె వినయ పూర్వకంగా వారికి నమస్కరిం

చింది. వామనరావు ఆమెను చిరునవ్వుతో పలకరించారు. ఎక్కడైనా సరే అందాన్ని ఆరాధించే పాణి మాత్రం ఆమె అందాన్ని నేత్రాలతోనే జుర్రుకో సాగాడు.

'మీకు చాలా శ్రమ యిచ్చాను. క్షమించండి. మరొక విషయం యీ కేసు పూర్తయే వరకు యిలాగే అప్పుడప్పుడు మిమ్మల్ని యిబ్బంది పెట్టాల్సొంటుంది. మరేం అనుకోరు కదూ' అంటూ వామనరావు లేచాడు.

'ఎంతమాట శెలవిచ్చారు? శ్రమా! నా యజమాని శ్రేయస్సుకోసం ఎంత శ్రమయినా నవ్వుతూ భరిస్తాను. అందులో మీవంటివారు మా యింటికి రావటం విశేషం కదూ!' అన్నాడు రాజన్ నమ్రతగా.

పాణి అప్పుడే వెళ్ళాలా అన్నట్టు వామనరావు వంక చూచి అన్నగారి సోఫా వెనుక చిరునవ్వులు చిందిస్తూ నిలబడ్డ గౌరివంక చూచాడు. అదే సమయంలో గౌరికూడా కళ్ళెత్తి అతనివంక చూచి అతను తనవంకే చూస్తూవుండటం గమనించి సిగ్గుతో తల వంచుకుంది. అదే సమయంలో హాలులోని మెట్లెక్కి మేడమీదకు పోతున్న ఒక వ్యక్తిని వెనకగా చూచి వామనరావు ఆశ్చర్యపోయాడు. అది గమనించి రాజన్ తనుకూడా అటుచూచి 'క్షమించండి' అంటూ తను త్వర త్వరగా కదిలి ఆ వ్యక్తి ననుసరించాడు. ఆ వ్యక్తి ఎవరు? అన్నట్టు తనవంక చూచిన ప్రశ్నకు సమాధానంగా గౌరి 'తాతగారు' మాత్రం అని వూరుకుంది.

వామనరావు పాణిని చెయ్యి పట్టుకు లేవతీసి బలవంతంగా బయటకు లాక్కుపోయి అజంతావద్ద ఆపిన కారులో కూలవేసి తను అతని పక్కగా కూర్చుని 'ఊఁ! పద సరాసరి బుహారికి' అన్నాడు. కారు కదిలింది.



బుహారీలో రూఫ్ గార్డెన్‌లో ఒకమూల కూర్చున్న వామనరావును ఉద్దేశించి 'బాస్! రాజన్ ఎంతమంచి హృదయుడో చూచావా! ఆ సంభావణ-ఆ మర్యాద-ఆ వినయం!'

'చాలించు బాబూ నీ భట్రాజు పొగడ్తలు - రాజన్‌ని మెచ్చుకుంటున్నావా! అతని చెల్లెలిని మెచ్చుకుంటున్నావా! అసలు నిజం చెప్పాలంటే అందమైన అమ్మాయి లెవరూ నీముందు పడకుండా యిక ముందయినా నేను జాగ్రత్త పడతాను' అన్నాడు నవ్వుతూ.

'మహానుభావా! ఆ పని చేయిద్దూ! నీకు పుణ్యముంటుంది. లేకపోతే అదేమి చిత్రమో అందమైన ఆడపిల్ల కనిపించగానే నా హృదయం కాకులేని గుర్రంలా పరుగెడుతుంది' నవ్వుతూనే జవాబు చెప్పాడు పాణి.

'అందుకే త్వరగా ఓ యింటివాడవు కమ్మంటున్నాను. నెలకు మూడు కాజువల్ లీవులు, ఎనిమిది 'లాస్ ఆఫ్ పే' లు పెట్టి పెళ్ళి సంబంధాలు చూడటానికి వెడుతున్నావు! అన్నీ చూసొచ్చేవే అవుతున్నాయి గాని చేసుకొచ్చేదొకటీ కనిపించటంలేదు' అన్నాడు వామనరావు.

'నా అభిరుచులకు తగని ఆడదాన్ని ఎలా చేసుకోను బాస్!' అన్నాడు పాణి.

'వద్దు, వద్దు చేసుకోవద్దు! అసలు నువు పెళ్ళి చేసుకోవద్దు - నీ అభిరుచులకు దొరికిన కన్య లభించేసరికి నీకు షష్టిపూర్తవుతుంది. అనక అమ్మగారు గృహప్రవేశం అయ్యగారు గంగా...'

'అదేమిటి బాస్! శుభం పలకరా పెంకినాన్నా అంటే పెళ్ళికూతురు ముండెక్కడుందన్నాడట వెనకటి కొకడు. 'శీఘ్రమేవ కళ్యాణ ప్రాప్తిరస్తు' అని దీవించక యీ శాపనార్థాలేమిటి మహాశయా!' అన్నాడు.

'కాకపోతే ఏమిటి? అభిరుచి - వంకాయ - గోంగూర పచ్చిడినీ. ఏదో కులమింటి కోతి అన్నట్టు ఎవరినో కాస్త కను ముక్కు తీరున్న పిల్లమెళ్ళో అమాంతం పుస్తె కట్టెయ్యక !' అన్నాడు వామనరావు నవ్వుతూ.

'అలా కాదు బాస్ ! ఇక యీ కేసు పూర్తయేవరకు పెళ్ళి సంబంధాలు చూడను. కేసు పూర్తయేదాకా ఏమిటి అసలు చూడనే చూడను. అంతే యిదే నా భీష్మప్రతిజ్ఞ.'

'అవునవును అంతా గౌరీమహాత్యం'అన్నాడు వామనరావు పగలబడి నవ్వుతూ.

పాణికూడా నవ్వుతూ 'అయితే యింతకీ రాజన్ ఎలాటి వాడంటావు' అన్నాడు.

'ఏమో ! అతి వినయం...'

'అంటే నీ ఉద్దేశం...?'

'ఏ పుట్టలో ఏ పాముందో ఎలా చెప్పగలం పాణి ! మరి ఒకటి రెండుసార్లు పరిచయం అవాలి' అన్నాడు సాలోచనగా.

'అసలు యింతకీ ఆనందరావు హృదయం గ్రహించటం అసాధ్యంగా వుంది. తను సర్వనాశనమయినా అతి ముఖ్యమైన రహస్యం బయట పెట్టనంటున్నాడు. అంటే దీని కంతకూ లోపల ఏదో నిగూఢరహస్యం దాగివుండాలి' అన్నాడు పాణి.

'ఆ రహస్యమే యిప్పుడు మనం భేదించాల్సివుంది. ఆనందరావు నిజంగా పూరు పెడుతున్నాడా ! లేక పెడుతున్నట్టు నటించి దొంగవ్యాపారస్థులను సృష్టించి పెద్దపెద్ద హోల్ సేల్ వ్యాపారస్తులను మోసగించి ధనం గుంజుతున్నాడా ?

ఈ విషయం మనం గ్రహించగలిగితే మీనాక్షి హత్యారహస్యానికి ఒక మార్గం ఏర్పడుతుంది' అన్నాడు వామనరావు.

'మీనాక్షి అంటే జ్ఞాపకం వచ్చింది. బాస్ / యింత మంచిగా కనపడుతున్న యీయన ఒకవేళ నిజంగా హత్య చెయ్య సమర్థుడంటావా' అన్నాడు.

వామనరావు చిరునవ్వుతో 'My dear boy ! అది సైకాలజీకి సంబంధించిన విషయం. ఒక్క మాట / ప్రతి వ్యక్తి యిద్దరు వ్యక్తులని ఒప్పుకుంటావా / ఉదాహరణకు నువ్వే వున్నావు. అంటే నువ్వు బయటకు మాట్లాడుతున్నంత తియ్యగా - ఆప్యాయంగా లోపల వుండలేవు. కాబట్టి ప్రతి మానవుడుబయట-లోపల యిద్దరువ్యక్తులుగా వుంటారు. అంతేగాక ప్రతిఒక్కరిలోను మంచి, చెడు అనేగుణాలు వుంటాయి. రక్తంలో తెల్లకణాలు, ఎర్రకణాలు వున్నట్టు. అందులో మంచి ఎక్కువపాలు వుంటే వ్యక్తి మంచివాడవుతాడు. చెడు ఎక్కువగా వుంటే చెడ్డవాడవుతాడు. అంతేకాదు ఒకొక్కసమయంలో స్వాభావికోద్రేకంవల్ల ఎంతో మంచి వారుకూడా పరమ దుర్మార్గులుగా మారిపోయే అవకాశం వుంది. అందుకని మనం ఆనందరావును అటు పూర్తిగా దోషి అనటానికి వీలులేదు. ఇటు నిర్దోషి అని చప్పరించటానికి వీలులేదు' అన్నాడు.

వారిరువురు ఒక్క పది నిముషాలు నిశ్శబ్దంగా కూర్చున్నారు. సర్వర్ వారి ఆర్డరుప్రకారం ఆమ్లెట్, బ్రెడ్ తెచ్చి ముందుంచాడు. వారు వాటిని నిశ్శబ్దంగా ముగించారు.

కారులో కోడంబాకంవైపు వెడుతున్న పాణి తనప్రక్కనే కూర్చున్న వామనరావు నుద్దేశించి 'బాస్ / మనం ఒకసారి శారదాంబగారిని కలుసుకుని మాట్లాడితే ప్రయోజనమేమన్నా వుంటుందేమో /' అన్నాడు.

వామనరావు మెచ్చుకున్నట్టు పాణి వీపు తట్టుతూ 'That's a good idea సరాసరి ఆనందరావు గారింటికి పోనీ' అన్నాడు.

వెంటనే పాణి కారును Back చేసి ముందుకు తిప్పి కోడంబాకం హైరోడ్‌గుండా ప్రయాణం సాగించాడు.



హాలులో ప్రవేశించిన డిటెక్టివ్‌లిద్దరినీ ఆప్యాయంగా ఆహ్వానించింది శారదాంబ. 'మీరు చేసినమేలు ఎన్నటికీ మరువలేము. మీ ఋణం ఏ విధంగా తీర్చుకోవాలో అర్థం కావటంలేదు' అంది ఆనందంతో గద్గదంగా.

'దానికేముందండి. మానవులమైన మనం ఒకొరి కొకరు సహాయం చేసుకోకపోతే ఎలాగ' అన్నాడు వామనరావు.

'వామనరావు గారూ! ఎంతశ్రమపడి అయినా యీ కేసు అంతు తేల్చండి. ఎంత డబ్బయినా వెనుదియ్యకద్దు. వారి మీద వచ్చిన ఆ నింద తొలగితే అంతేచాలు' అంది దీనంగా శారదాంబ.

'అమ్మా! మా శాయశక్తులా ప్రయత్నిస్తాం. ఆ పైన దైవం ఎలా నిర్ణయిస్తాడో! మీరు ఒకటి రెండు ప్రశ్నలకు సమాధానం చెప్పాలి' అన్నాడు వామనరావు.

'ఓ! అంతకన్నానా అడగండి' అంది శారదాంబ.

'మీవారు-అదే ఆనందరావు గారు మీరంటే అభిమానంగానే వుంటారు కదూ!'

ఈ ప్రశ్నతో శారదాంబ తబ్బిబ్బయింది. ఆమె ఆశ్చర్యంగా వామనరావు వంక చూస్తూ 'అభిమానమంటే అంతా ఇంతా కాదు-అంతవరకుఎందుకు మా వివాహంఅయి దాదాపు పదిహేను సంవత్సరాలు కావస్తూంది. మేమెన్నడూ ఒక మాటామాటా అనుకునిగాని లేక ఒకరిమీద ఒకరం విసు

తక్కునిగాని ఎరుగము. పాపిష్ఠిదాన్ని! ఆ రాత్రి శేఖరం వచ్చి హత్య విషయం గురించి చెప్పి ఆనవాళ్ళు వగైరా చెప్పగానే ఆయన్ను అనుమానించాను కూడా.' అంటూ కళ్ళుతుడుచు కుంది.

'అదే మానవ స్వభావం. మీరు దానికి విచారించాల్సిన పనిలేదు. అయితే యీ మధ్య అంటే దాదాపు సంవత్స రంగా ఆయన ప్రవర్తన ఏమైనా మారినట్టు మీరు గ్రహిం చారా?' అన్నాడు.

శారదాంబ కొంచెం యోచించి - 'మీరా ప్రశ్న ఏ ఉద్దే శంతో అడుగుతున్నారో అర్థం కావటం లేదు. అయినా ఒక సంవత్సరంగా వారు ప్రతి నెలా గ్రామాంతరం వెళ్ళి నాలుగయిదు రోజులు వుంటున్నారు. ఇదివర కెప్పుడూ వంటరిగా వెళ్ళే వారు కాదు. వేసవికాలంలో మాత్రం ఒక నెల రోజులు వూటీలో వున్న మా బంగళాలో గడిపి వచ్చే వాళ్ళము. అంత ఖరచుగా ప్రయాణాలు ఎందుకు చేస్తు న్నారు అని అడిగితే ఆయన నవ్వుతూ 'వ్యాపారం శారదా! దీనికోసం ఒక్కొక్కప్పుడు ప్రపంచకోస కయినా వెళ్ళా లని వుంటుంది' అన్నారు. అంతే. ఆ తరువాత నేనడుగనూ లేదు ఆయన చెప్పనూ లేదు. ఇంతమాత్రం చేత ఆయన ప్రవ ర్తనలో మార్పు వచ్చినట్టు చెప్పటం కష్టం' అంది.

ఒక్క క్షణం యోచించి వామనరావు 'రాజన్ ఎట్టి వాడని మీ ఉదేశం' అన్నాడు.

'అతనితో నాకు అంతగా పరిచయం లేదు. మా వద్ద నౌకరి ప్రారంభించిన యీ నాలుగయిదు సంవత్సరాలలోనూ ఏ నాలుగయిదుసార్లు వచ్చాడో! మా వారికిమాత్రం ఆయ నంటే మంచి అభిప్రాయం నమ్మకం కూడా వుంది. అలా చాలాసార్లు ఆయన నాతో అన్నారు కూడా. అంతేకాదు

అసలు రాజన్ మేనేజర్‌గా వుండటం వల్లనే వ్యాపారం యింత వృద్ధిలోకి వచ్చిందని వారి విశ్వాసం. అందుకనే ఆయన వ్యక్తిగత విషయాలు కూడా రాజన్ చూస్తూ వుంటాడు. ఇంతెందుకు దాదాపు రెండు సంవత్సరాల క్రిందట మా అత్తగారు చనిపోయింది. ఆమె తనకున్న కొద్ది ఆస్తిని మా వారి పరం చేసి పోయిందని దానిని వశపరచు కునేందుకు రావలసిందిగా స్థానిక అధికారులు మా వారికి తెలియ జేసారు. అయితే వారు వెళ్ళకుండా రాజన్‌ను పంపి ఆ ఆస్తిని వశపర్చుకుని అక్కడే ఎవరికయినా విక్రయించి ఆ సొమ్మును స్థానిక ధర్మ సంస్థలకు, ఆసుపత్రులకు అత్తగారి పేరిట దానం చేసి రమ్మని పంపారు.'

'అయితే తల్లి పోయినప్పుడుగూడా ఆనందరావు గారు వెళ్ళలేదన్నమాట' ఆశ్చర్యంగా అడిగాడు వామనరావు.

'లేదు. దానికి కారణంకూడా వుంది. మావారు యింత సంపాదించి ఎంతో గౌరవంగా బ్రతుకుతున్నప్పటికీ అత్తగారు మాత్రం ఆమె భర్త స్కూలుమాష్టరు పనిచేసి కూడబెట్టిన డబ్బుతోనే కాలం వెళ్ళబుచ్చింది గాని, వారు ఎన్నిసార్లు రమ్మని పట్టుపట్టినా ఒక్కసారయినా వచ్చి వుండలేదు. అంతేగాక వారు నెలనెలగా పంపిన డబ్బును అలాగే తిప్పి పంపిందేగాని ఒక దమ్మిడీ అయినా స్వీకరించలేదు. చివరకు ప్రాణం విసిగిన మా వారు తనకు తల్లే లేదనుకుంటానంటూ వుత్తరం వ్రాసారు. అంతటితో అప్పుడప్పుడు వస్తున్న ఉత్తరాలుగూడా ఆగిపోయాయి. అప్పటినుంచీ వారు ఆమె విషయం ఎత్తేవారు కారు. అందువల్ల చనిపోయిందని ఉత్తరం రాగానే వారు కొంత విచారించారు గాని తను వెళ్ళటం సంభవిస్తే ఆ పూర్వస్థితిగతులు జ్ఞాపకం వచ్చి మనస్సును

కలచివేస్తాయని రాజన్‌ని పంపారు. రాజన్ అంటే వారికి అంత నమ్మకం, అంత అభిమానం' అంది శారదాంబ.

శారదాంబ చెప్పినదంతా విన్న వామనరావు 'శారదాంబ గారూ! ఆనందరావు గారు నెలకు నాలుగుసార్లు గ్రామాంతరం వెళుతున్నారని చెప్పారుకదూ! అలా వారు ఎక్కడకు వెడుతున్నారో కొంచెం సేకరించగలరా! దాని మీద మన కేసంతా ఆధారపడివుందని తెలిసికూడా ఎన్నిసార్లడిగినా ఆనందరావు గారు 'క్షమించండి' అంటారేగాని తనెక్కడకు వెళ్ళిందీ తెలియపర్చరు. నా శాయశక్తులా ప్రయత్నించాను. లాభం లేకపోయింది. కానీ మీరయినా ప్రయత్నిస్తే ఏమైనా బయటపెడతారేమో! అలాటిదేమన్నా వుంటే మీరు తెలుసుకున్న విషయం నాకు రేపుఉదయం పదిగంటల లోగా ఫోన్ చెయ్యండి! శెలవు' అంటూ లేచి పాణి చెయ్యి పుచ్చుకుని బయలుదేరి కంచురథ మెక్కారు. వెంటనే కంచురథం కోడంబాకంవైపు జోరుగా పరుగెత్తింది.

## 6

కోర్టు ఆవరణంతా జనంతో క్రిక్కిరిసివుంది. ఆనంద్ ఫైనాన్స్ కార్పొరేషన్ వారిమీద, ది న్యూ బాంబే పెన్ మాన్‌ఫాక్చరింగ్ కంపెనీవారు తమకు ఇవ్వబడ్డ హామీపత్రం తాలూకు డబ్బు ఆనందరావుగారు ఎగవెయ్యచూస్తున్నారని తెచ్చిన అభియోగం విచారణ జరుగుతోంది. ఇరుపక్షాల న్యాయవాదులు తమతమ వాదనలు వినిపించిన తరువాత వాది తరఫు వకీలు ఆనందరావుగారిని క్రాస్ఎగ్జామిన్ ప్రారంభించాడు.

'అయితే యీ అగ్రిమెంటు మీరు వ్రాసియిచ్చింది కాదనేగా మీ డిఫెన్సు.'

'ఈ అగ్రిమెంటు జరిగిన తేదీన మీరు గ్రామంలో కూడా లేరనికదూ మీ వాదన.'

'అవును - లేను.'

'అయితే ఏ గ్రామంలో వున్నారు?'

'అది నేను చెప్పలేను.'

'మీరు చెప్పితీరాలి'

'వీలు గాదు'

వెంటనే వాది తరఫున వకీలు న్యాయాధిపతిని చూస్తూ 'మిలార్డ్! అండ్ ది జెంటిల్ మెన్ ఆఫ్ ది జ్యూరి - ఈ పాయింటు జాగ్రత్తగా నోట్ చేసుకో వలసిందిగా కోరుతున్నాము. ఈ కేసులో ప్రతివాది సాక్షియింటయిన వాదికి తను ఎటువంటి హామీ పత్రం ఇవ్వలేదంటూ అసలు తను ఆ తేదీన యీ గ్రామంలో లేనట్టు చెపుతున్నాడు. ఏ గ్రామంలో వున్నదీ కూడా చెప్పనంటున్నాడు. కాబట్టి కోర్టు వారు ముఖ్యంగా యీ విషయం గమనించ ప్రార్థన' అన్నాడు.

వెంటనే జడ్జిగారు తలవంచుకుని తన ముందున్న కాగితం మీద రెండు మాటలు వ్రాసి వెంటనే ఆనందరావుగారిని చూస్తూ - 'ఆ ప్రశ్నకు సమాధానం చెప్పవలసిందిగా కోర్టు మిమ్మల్ని ఆదేశిస్తూంది మీరు చెప్పితీరాలి' అన్నాడు.

'క్షమించండి మిలార్డ్! ఆ ఒక్క ప్రశ్నకు సమాధానం చెప్పలేను' అన్నాడు ఆనందరావు.

'మీ డిఫెన్సుకు అతి ముఖ్యమైన యీ విషయాన్ని మీరుమరుగుపరిస్తే ఫలితం మీకు బాధ కలిగించవచ్చు-ఆలోచించుకోండి' అన్నాడు జడ్జి.

'తెలుసు మిలార్డ్! నేను ఏమయినాసరే! యీప్రశ్నకు మాత్రం సమాధానం చెప్పజాలను. నన్ను నిర్బధించవద్దని సవినయంగా మనవిచేసుకుంటున్నాను' అన్నాడు.

'అయితే యింతటితో నా క్రాస్‌పరీక్ష కూడా మాగిస్తున్నాను' అన్నాడు వాది తరపు వకీలు.

దూరంగా ప్రేక్షకుల గ్యాలరీనుండి యిదంతా గమనిస్తున్న వామనరావు ముఖంమీద నిరాశామేఘాలు కమ్ముకున్నాయి. అతను ప్రతిక్షణం తన వాచివంక చూస్తూ దేనికోసమో ఎదురుచూస్తున్నట్టు అత్రుతవ్యక్తపరుస్తున్నాడు. ఇంతలో దూరంనుండి పాణి రాకను గమనించిన అతనికళ్ళు వుత్సాహంగా మెరిశాయి.

పాణి త్వరత్వరగా వామనరావు కూర్చున్న బెంచీవైపుగావచ్చి అతని చెవిదగ్గరగావంగి మెల్లగా 'అయిదు నిముషాలక్రితం శారదాంబ ఫోన్ చేసింది. ఆమె ఎంత ప్రయత్నించినా ఆనందరావుగారు మనప్రశ్నకు సమాధానం చెప్పలేదట' అన్నాడు.

వామనరావు విసుగ్గా ముఖం చిట్లించి కళ్లుమూసుకుని వూరుకున్నాడు.

'సైలెన్సు' అన్న డఫేదార్ కేకతో కోర్టు గదిలో వ్యాపించిన అలజడి అణిగింది.

ఆనందరావుగారి వకీలు, వాది అయిన ది న్యూ బాంబే పెన్ మాన్ ఫాక్చరింగ్ కంపెనీ ప్రొప్రయిటర్ అబ్దుల్ మజీద్ భాయిని క్రాసుపరీక్ష ప్రారంభించాడు.

'ఈ ట్రాన్సాక్షన్ జరగటానికిపూర్వం మీరెప్పుడైనా ఆనందరావుగారిని కలుసుకున్నారా?'

'లేదు.'

'ఈ వ్యాపారం జరిగినపుడు మీరు సరాసరి ఆనందరావు గారిని కలుసుకున్నారా.'

'అవును'.

'మీ ఖాతాదారులకు హామీపత్రాలిచ్చే ఫైనాన్సర్లందరినీ మీరు స్వయంగా కలుసుకుంటారా.'

'లేదు. ఖాతాదారులే సెక్యూరిటీబాండ్ తెచ్చుకుంటారు. వారిమీద నమ్మకంచేత మేము వెంటనే మా ఖాతాదారునికి ఆ హామీపత్రం విలువకు సరకు ఒకసారిగా కాని లేక ఖాతా దారుడు కోరినట్టు దఫాలువారీగా కాని సప్లయి జేస్తాము'.

'అయితే యీ ప్రత్యేకమైన కేసులోమాత్రం మీరు ఖాతాదారునితో ఆనందరావుగారి దగ్గరకు వ్యక్తిగతంగా ఎందుకు వచ్చారు?'

'అందుకు రెండు కారణాలు-ఒకటి అంతకు ముందు ఆనంద్ ఫైనాన్స్ కార్పొరేషన్ మంచిపేరును సంపాదించు కుని వుండటంవల్ల ఆనందరావుగారిని చూడాలనే కోర్కె ఒకటి: రెండవది నేనుసరుకు సప్లయి చెయ్యవలసిన ఆ ఖాతా దారుడు వరదరాజులు అంత నమ్మకమైన వ్యక్తిగా నాకు

కనుపింపక పోవటంలో ఆందరావుగారిని హెచ్చరిద్దామని వెళ్ళాను.'

'అలా హెచ్చరించారా?'

'లేదు! అందుకు ఆయన నాకు అవకాశంకూడా యివ్వలేదు.'

'అయితే ఆనాడు మీరు చూసినపుడు ఆనందరావుగారు ఆఫీసులో వున్నారు గదూ.'

'చక్కగా వున్నారు.'

'అయితే ప్రస్తుతం అక్కడ కూర్చున్న ఆనందరావుగార్ని జాగ్రత్తగా చూచి మీరు ఆనాడు చూచిన ఆనందరావు ఆయనే నేమో కొంచెం వివరంగా చెప్పగలరా?'

వెంటనే వాది తరఫు వకీలు లేచి - 'మిలార్డ్! యీ ప్రశ్నకు నే నభ్యంతరం తెలుపుతున్నాను. ఈవిధంగా నా క్లయింటుచేత ఎలాగయినా తప్పుదోవ త్రొక్కించాలని చూస్తున్నారు డిఫెన్సువారు' అన్నాడు ఆవేశంగా.

'మై లెర్నెడ్ ఫ్రెండ్! ఎందుకలా ఆవేశపడతారు? పూరికే ఆ వ్యక్తేనా అవునా కాదా అని పరిశీలించమన్నానండి. యింతమాత్రంచేత మీ క్లయింటు తబ్బిబ్బయి కేసు పాడుచేసుకుంటే ఆ కేసు ఎంత బలహీనమైన పునాదిమీద నిర్మింపబడిందో అర్థమవుతుంది' అన్నాడు ఆనందరావుగారి వకీలు వాది తరఫున వకీలుతో.

'అభ్యంతరం త్రోసివెయ్యబడింది. మీరు ఆ ప్రశ్న అడుగవచ్చును' అన్నాడు జడ్జి ఆనందరావుగారి వకీలుతో.

ఆనందరావుగారి వకీలు విజయగర్వంతో ఒకసారి వాది తరఫు వకీలువంక చూచి 'మజీద్ సాబ్! మీరు ఈ కోర్టులో వున్న ఆనందరావుగారి నేకదూ ఆనాడు కలుసుకున్నది. జాగ్రత్తగా యోచించి చెప్పండి' అన్నాడు.

మజీద్ ఒకసారి ఆనందరావును ఓరకంటచూచి 'అవును యీయనే. అత్తమందిలోనయినా యీ వ్యక్తిని నేను గుర్తు పట్టగలను' అన్నాడు.

'సరే యిక మీరు వెళ్ళవచ్చు.'

మజీద్ భాయి బోనుదిగి క్రిందకు వెళ్ళిపోయాడు. ఆ తరువాత - హాండ్ రైటింగ్ ఎక్స్పర్ట్స్ యిద్దరువచ్చి బోనులో నిలచి ప్రమాణాలు చేసారు. ఆనందరావుగారు కనీసం తన కళ్ళతోనయినా చూడలేదంటున్న హామీ పత్రాలమీద సంతకం ఆయనదేనని ఫోర్జరీ ఎంతమాత్రం కాదని తాము జరిపిన 'కెమికల్' మైక్రోస్కోపిక్ పరీక్షలవల్ల బయటపడిం దని ప్రమాణసహితంగా చెప్పారు.

న్యాయాధిపతిని వుత్తరవుకోరిన ఆనందరావుగారి వకీలు ఆ మేధావులతో - 'అది ఆనందరావుగారి సంతకం కాకుండా ఫోర్జరీ అవటానికి ఎంతమాత్రం ఆస్కారం లేదుకదూ' అన్నాడు సూటిగా.

'లేదు! ఎంతమాత్రం లేదు! ముమ్మాటికి లేదు! అలా అది ఆనందరావుగారి సంతకం కాదని ఋజువుపరచగలిగితె యిక మేము యీ పని వదలి వెళ్ళిపోతాము' అంటూ తీక్ష ణంగా పలికారు.

కోర్టు హాలులో తిరిగి అలజడి ప్రారంభమైంది. ఇంతలో ఒక కానిస్టేబుల్ హడావిడిగా పరుగెత్తుకుంటూవచ్చి రాజశేఖరం దగ్గరగా వెళ్ళి అటెంక్షన్‌లో నిలబడి మెల్లగా ఏమో చెప్పాడు. శేఖరం తన పక్కనే కూర్చున్న వామనరావు గారితో 'రాయపురంనుంచి మిమ్మల్ని ఒక స్త్రీ ఫోనులో అర్జంటుగా కలుసుకోమంటున్నదట. ఈ కేసుకు సంబంధించిన ఒక ముఖ్యవిషయం మీతో చెప్పాలని ఆదుర్దా పడుతున్నదట' అన్నాడు ఆత్రంగా.

వామనరావు వెంటనే లేచి త్వరత్వరగా అడుగులు వేసుకుంటూ ఫోన్ గదిలోకిపోయి రిసీవర్ తీసి 'హలో' అన్నాడు. వెంటనే సమాధానం వచ్చింది. ఆ సమాధానం అతి త్వరగా ఆవేశంగా చెపుతున్నట్లు వుంది. ఆ సమాధానంలోని ప్రతి మాటకు వామనరావు ముఖ భంగిమలు మారసాగాయి. క్రమంగా అతనిలో వుత్సాహం తొణికిస లాడసాగింది.

'ఓ. కె! సాయంత్రం తప్పకుండా మిమ్మ కలుసుకుంటాను. మీరు నిజంగా కోర్టుకువచ్చి యీ విషయం ధైర్యంగా బయటపెట్టగలిగితే మన కెంతో ఉపకారం జరుగుతుంది' అంటూ రిసీవర్ పెట్టేసి దాదాపు పరుగెత్తుతున్నంత వేగంగా కోర్టులోకివచ్చి తమ వకీలుతో రెండు నిముషాలు త్వరత్వరగా అతని చెవిలో మాట్లాడి తన స్థానంలో కూర్చున్నాడు.

ఆనందరావుగారి వకీలు తన లాకోటు సవరించుకుంటూ లేచి నిలబడి 'మిలార్డ్ - మేము డిఫెన్సుతరఫున యీ కేసులో ఒక అతిముఖ్యమైన సాక్షిని ప్రవేశ పెట్టదలచుకున్నాము.

దయచేసి కేసుకు నాలుగురోజులపాటు వాయిదా యిప్పించ వలసిందిగా ప్రార్థిస్తున్నాను' అన్నాడు.

వెంటనే వాది తరఫు వకీలు లేచి 'మిలార్డ్! అడ్జర్న్ మెంటుకు మేము ఒప్పము. అదీకాకుండా యీరోజుకు సరిగా నాలుగోరోజు ఆనందరావుగారిమీద 'నారీహత్యాభి యోగం' విచారణ ప్రారంభమవుతుంది' అన్నాడు.

జడ్జిగారు ఒక నిముషం యోచించి ఆనందరావుగారి వకీలుతో - 'మీకు మూడురోజుల గడువు చాలదూ' అన్నాడు.

వకీలు వామనరావుగారి వంక చూచి ఆయన సంజ్ఞను గ్రహించి 'చాలు మిలార్డ్!' అన్నాడు.

'అయితే కేసును మూడవనాటికి వాయిదా వేస్తున్నాను' అంటూ జడ్జిగారు లేచారు.

## 7

ప్రాణి డ్రైవ్ చేస్తున్న కంచురథం రాయపురంలో 'ఇందూ నిలయం' ముందు వేగంగా వచ్చి ఒక్కఅదటున ఆగి పోయింది. కారును గేటుగుండా పోర్టికోలోకిపోనిచ్చి ఆపి డిటెక్టివ్‌లిద్దరూ హాలులోకి ప్రవేశించారు. అక్కడ నడి వయస్సులో వున్న ఒక అత్యంత అందమైన స్త్రీ వారిని ఆహ్వానించింది.

'మీపేరు ఇందిర అనుకుంటాను' అన్నాడు వామనరావు నౌకరు ట్రేలో తెచ్చి యిచ్చిన వింటో గ్లాసు అందుకుంటూ.

'అవును.' అంటూ ఆస్త్రీ 'వాయిదా దొరికిందా' అంది.

'ఆ! ఎల్లుండివరకు అడ్జర్న్‌మెంటు లభించింది. ఈలోగా మీరు చెప్పదలచుకున్న విషయాలు నాకు వినిపిస్తే అందులో మనకు 'కోర్టు'లో ఎంతవరకు వుపకరిస్తుందో చూచి తరువాత కార్యక్రమం ఆలోచించవచ్చు. ఇంతకూ ఆనందరావుగారు సమాధానం చెప్పటానికి నిరాకరించిన ప్రశ్నకు మీరు సమాధానం చెపుతానన్నారుకదూ!'

'అవును! ఆనంద్ యీబోగస్ అగ్రిమెంట్లు సృష్టింప బడిన తేదీలలో గ్రామాంతరంలో వున్నాడని చెప్పినమాట అక్షరాలా నిజం. అందుకు ప్రత్యక్ష సాక్ష్యం నేనే! మేమిద్దరం కలిసే వెళ్ళేవాళ్ళము' అంది తలవంచుకుని సిగ్గుగా.

'ఇందిరగారూ! మీకు తెలిసినవిషయాలన్నీ మీరు చెప్పదలచుకున్నదంతా వివరంగా చెప్పండి. అది మీ వ్యక్తిగత జీవితానికి సంబంధించిన ఎంత రహస్యమైనా ఆనంద రావుగార్ని కాపాడటానికి వుపకరిస్తుందని తోస్తే దాచ కుండా చెప్పండి!' అన్నాడు.

ఇందిర రెండునిముషాలపాటు యోచించి ఒక నిశ్చ యానికి వచ్చినట్టు తలపంకించి - 'ఆనంద్ నేనూ చిన్న ప్పటినుంచీ క్లాసుమేట్సుము. కాలేజీలో చదివే రోజుల్లో ఎన్నో ఆలోచనలు, ఎన్నో మధురస్వప్నాలు, మరెన్నో గాలిమేడలు నిర్మించుకున్నాం.ఒకర్ని విడిచి ఒకరం జీవించలే మనుకున్నాం. అయితే అతని బీదతనం మాయిద్దరిమధ్యా ఒక గిరి గీసింది. దాంతో మాతండ్రిగారు సారహస్య ప్రణయం గ్రహించి చదువు మాన్పించి నన్ను అజ్ఞాతకా

రయిన ఓనలభైఏండ్ల వ్యక్తికి ద్వితీయ కళత్రంగా కాళ్లు
కడిగి దానంచేసి తన కూతురిని ఒక అష్టాధికారికి యిచ్చి
వివాహంచేసానని గొప్పలు చెప్పుకున్నాడు. అప్పటినుంచీ
జీవితం దుర్భరమైపోయింది. చనిపోదామని ఎన్నోసార్లు
ప్రయత్నించాను. కాని చావలేకపోయాను. ఆఖరుకు నా
వివాహం అవటంతో మతి చలించినట్లయి ఆనంద్ వూరు
వదలి తల్లిని వదలి దేశాంతరగతుడైనాడు. ఆతరువాత పది
హేనుసంవత్సరాలు పదిహేనుయుగాలుగా గడిపాను. నిజం
చెప్పాలంటే నానుంచి మావారు ఏసుఖం అనుభవించలేక
పోయారు. ఆ దిగులుతోనే వారు రెండుసంవత్సరాలక్రితం
అకస్మాత్తుగా కన్నుమూసారు. వారి జీవితంలో న్యాయవాద
వృత్తిలో సంపాదించిన ఆస్థి నాలుగులక్షల రూపాయలు
నాపేరవిల్లురాస్తూ అందులో ఒక షరతు పెట్టారు. ఆ షరతు
ప్రకారం నేను వారు పోయిన మూడుసంవత్సరాలలోగా
మనసు మార్చుకుని పునర్వివాహంచేసుకున్నట్టయితే వారి
ఆస్థి ఒక్కదమ్మిడికూడా నాకు దక్కదు. అది వారి ప్రథమ
భార్య తాలూకు వారికి, వారసులకు చెందుతుంది. అసలు
ఆనంద్‌ని పోగొట్టుకున్నతరువాత నాకు జీవితంమీదే విరక్తి
పుట్టిపోయింది. ఇక పునర్వివాహంమాట అసలే లేదు.

'అయితే ఒక సంవత్సరం క్రిందట అకస్మాత్తుగా జరిగిన
ఒక సంఘటన నా జీవితాన్ని, నా నిశ్చయాన్ని మార్చి
వేసింది. ఒకానొక మిత్రురాలియింట్లో వివాహసందర్భంలో
జరిగిన విందులో అకస్మాత్తుగా ఆనంద్ నాకు పునర్దర్శన
మిచ్చాడు. అంతే అప్పటినుంచీ మోడువారిపోయిన మా

ప్రణయలత తిరిగి చిగురించి మొగ్గతొడిగి పుష్పించింది. బీటలు వారిపోయిన మా హృదయ సీమలు ప్రణయవర్షంతో సస్యశ్యామలాలయినాయి. ఆనంద్ వివాహితుడని తెలిసి వుండీ అతన్ని పూర్వంకన్న మిన్నగా ఆరాధించసాగాను. మేము మా వయస్సును మరచి తిరిగి చిన్నపిల్లలమైపోయాము. తన భార్యను ఎలాగయినా ఒప్పించి నన్ను వెంటనే వివాహమాడాలని పట్టుపట్టాడు ఆనంద్. అయితే మా వారు పెట్టిన గడువు యింకొక సంవత్సరం వుండటంచేత అంత వరకూ ఆగమని ఆస్తిని పూర్తిగా చేజిక్కించుకుని తర్వాత వివాహం చేసుకుందామని నేనే పట్టుపట్టాను. తనకు కావలసినంత డబ్బువుందని యీడబ్బు మనకొద్దు వెంటనే వివాహం చేసుకుందామని పట్టుపట్టాడు ఆనంద్. కాని నేను చూస్తూ చూస్తూ నాలుగు లక్షల ఆస్తిని వదలలేక ఒక సంవత్సరం ఆగమని బలవంతంచేసాను. తప్పనిసరిగా వప్పుకున్నాడు ఆనంద్. అయితే యీ సంవత్సరం ఎలా అతని ఎడబాటును సహించడము? అందువల్ల మేము ప్రతినెలా నాలుగయిదు రోజులు ఢిల్లీ, బొంబాయి, కలకత్తా నగరాల్లో రహస్యంగా ఆనందంగా గడిపి వస్తుంటాము. అలా గడిపినట్లు ఆయా నగరాలలోని హోటల్ రిజిష్టర్లు మీకు తెలుపుతాయి. అంతేగాక ఆ హోటల్ గది అద్దె రశీదులు వగైరా యీ క్షణం నాదగ్గర వున్నాయి.

'మా వారి వారసులు ఎలాగో యిది పసిగట్టారు. మా రహస్యం బయటపెట్టి ఆస్తిని నాకు దక్కకుండా చెయ్యాలని వారి అభిప్రాయం. అందువల్ల క్రిందటిసారి మేము కల

కత్తాలో ఒక ఉద్యానవనంలో వుండగా రహస్యంగా ఒక ఫోటోకూడా తీసారు. ఆనంద్ త్వరగాలేచి ఆ ఫోటోగ్రాఫర్‌ని పట్టుకునేలోపునే అతను దొరక్కుండా పారిపోయాడు. ఎటువంటి ప్రమాద పరిస్థితిలోనూ మారహస్యం బైటపెట్టనని ఆనంద్ నాకు వాగ్దానం చేసాడు. ఆ వాగ్దానానికి కట్టుబడే అతను తనమీద యింత అపదవచ్చినా ఆ వాగ్దానభంగం చెయ్యలేదు. చివరకు యీరోజు పరిస్థితులు విషమించటం చూచి నేనుఒక నిశ్చయానికి వచ్చాను. జరిగినదంతా విపులంగా కోర్టువారి ముందుంచి ఆనంద్‌మీద తీసుకురాబడ్డ అభియోగాన్ని పునాదితో సహా కదలించివెయ్యాలని నిశ్చయించుకున్నాను. అందుకే ముందు మీ సలహా పొందుదామని మిమ్మల్ని రావించాను. పరిస్థితులన్నీ మీకు వివరంగా చెప్పాను. ఇక మీరు ఆనంద్‌ని విడిపించటం తరువాయి. యీ విషయాలన్నీ చెప్పటానికి నేను ప్రపంచంలోని ఏ న్యాయస్థానానికయినా వస్తాను. ఇక భయపడను' అంటూ నిశ్చయంగా చెప్పింది. ఆమె నేత్రాలు ఆ కఠోర నిశ్చయంతో మిలమిల మెరిశాయి.

ఇందిర చెప్పిన విషయాలన్నీ కళ్లుమూసుకుని శ్రద్ధగా ఆలకించిన వామనరావు కొద్ది క్షణాలు యోచించి - 'ఒక ప్రశ్న ఇందిరగారూ! ఆరోజు రాత్రి - బీచిలో మీనాక్షీహత్య జరిగిన రోజు రాత్రి-ఆనందరావుగారు యిక్కడకు వచ్చారా' అన్నాడు.

ఇందిర ముఖం యీ ప్రశ్నవిని సిగ్గుతో ఎరుపెక్కింది. ఆమె తలవంచుకునే - 'ఆ వచ్చాడు' అంది.

'ఎన్ని గంటలకు?'

'పదకొండూ పన్నెండు గంటలమధ్య.'

'ఎన్ని గంటలవరకూ యిక్కడ వున్నారు.'

'రెండున్నరదాకా వున్నారు.'

'అంతకుముం దెప్పుడయినా యిలా రావటం వుందా?'

'లేదు ఎన్నడూ రాలేదు. ఆరోజు అతనిరాక నాకు నిజంగా ఆశ్చర్యాన్ని కలిగించింది కూడా! అదేప్రశ్న అతనిని అడిగాను. నన్ను చూడాలనే కోర్కె బలవత్తరమైందని యిక వుండపట్టలేక న్యాయమూర్తి కాంతారావుగారి యింటి విందునించి సరాసరి వచ్చానని చెప్పారు' అంది ఇందిర.

'అయితే యీ విషయాలన్నీ ఇన్‌స్పెక్టర్ శేఖర్ ముందు చెప్పి ఒక స్టేటుమెంటు యివ్వటానికి మీకేమీ అభ్యంతరం వుండదనుకుంటాను.'

'ఏంతమాత్రం వుండదు' అంది యిందిర నిశ్చయంగా.

'త్వరలోనే తిరిగి మిమ్మల్ని కలుసుకోగలను' అని వామన రావు పాణితోసహా బయటపడి కంచురథమెక్కాడు. వెంటనే కంచురథం పోలీస్ స్టేషన్ వైపు దౌడుతీసింది.

# 8

అయితే యిందిర చెప్పిన విషయాలన్నీ మీరు విశ్వసించారన్నమాట' అన్నాడు ఇన్‌స్పెక్టర్ శేఖరం తన ఎదుట కూర్చున్న వామనరావుని చూస్తూ హేళన స్ఫురించే కంఠంతో

'ఏం ఎందుకు విశ్వసించరాదు' అన్నాడు వామనరావు రెట్టిస్తూ.

'చూడండి వామనరావురావుగారూ! ఒక చిన్నవిషయం. హత్యజరిగి అయిదురోజులైంది. నిజంగా యీ విషయాలు జరిగివుంటె ఇందిర యింతకుముందే బయటపడి వుండాల్సింది. చూడగా యిదంతా ఆ ఆనందరావు గారు ఆడిస్తున్న నాటక మేమోనని నాకు నమ్మకం కలుగుతూంది' అన్నాడు శేఖరం వామనరావుకు తెలియని కొత్తవిషయమేదో తాను చెపుతున్నట్టు.

ఎదురుగా కుర్చీలో కూర్చుని 'డీలక్స్' వెలిగించుకుంటున్న పాణి 'శేఖరంగారూ! కామెర్ల కళ్ళకు ప్రపంచమంతా పచ్చగా కనిపిస్తుందట! ఈవిషయం మీకు తెలుసా' అన్నాడు వ్యంగ్యగా.

'పాణీ! కొంచెం యోచించి మాట్లాడు. చిన్నా పెద్దా తారతమ్యం వుండనక్కర్లా'అంటూ గసురుకున్నాడు శేఖరం.

'అవునవును! వుండాలి! తప్పకుండా వుండాలి' అంటూ పగలబడి నవ్వుతూ స్టేషన్ బయటకు వెళ్ళాడు.

పాణి వెళ్ళిన వెనుక చిన్నబుచ్చుకున్న శేఖరం వంక అనునయంగా చూస్తూ 'అతనిమాటలతో మనకేంలే శేఖర్! యింతకూ యీ విషయంలో నువ్వేమి యోచించావు' అన్నాడు వామనరావు.

'నేనొకసారి ఇందిరను కలుసుకుని మాట్లాడిగాని ఏ విషయం చెప్పలేను' అన్నాడు శేఖరం పాలోచనగా.

'ఓ! తప్పకుండా అలాగే చెయ్యి' అంటూ వామనరావు రాయపురంలోని ఇందిర యింటి అడ్రసుయిచ్చి ఆమెను కలుసుకొనగానే ఒకసారి తనయింటికి ఫోన్ చెయ్యమని చెప్పి బయటకు వచ్చాడు.

## 9

కోడంబాకంలోని తమ స్వగృహంలో పైకిటుగదిలో రివాల్వింగ్ ఛైర్‌లో కళ్లు మూసుకుని కూర్చుని ఆనందరావు గారి కేసు సింహావలోకనం చేసుకుంటున్న వామనరావు బల్లమీద టెలిఫోన్ మ్రోగడంతో వులికిపడి కళ్లు తెరచి రిసీవర్ అందుకున్నాడు. వెంటనే అవతలివైపునుంచి శేఖరం కంఠం ఆదుర్దాగా - 'హలో వామనరావుగారేనా మాట్లాడేది' అన్నాడు.

'అవును! ఏమిటి శేఖరం ఆదుర్దా'

'ఆదుర్దా అంటున్నారా! కొంప మునిగింది. మరొక సారీ హత్య జరిగింది. ఇందిర సాక్ష్యం యిక మనకు దొరకదు. మీరు వెంటనే బయలుదేరి రాయపురం రండి' అంటూ రిసీవర్ పెట్టేశాడు.

ఒక క్షణం కాలంపాటు తెల్లబోయిన వామనరావు తేరుకుని వంటమనిషిని కేకేసి, పాణి ఫోన్ చేసినా, సరాసరి వచ్చినా వెంటనే రాయపురం రమ్మని చెప్పి త్వరగా బయటకువచ్చి కంచురధం ఎక్కాడు. మరుక్షణం కంచురధం వందమైళ్ళ వేగంతో రాయపురంవైపు వురికింది.

అయిదు నిముషాల్లో రాయపురం చేరుకున్న వామనరావు కారునుండి దూకి లోనికి పరుగెత్తాడు. ఎదురుగా తనకు

శాల్యూట్ చేస్తున్న కానిస్టేబుల్‌ను చూడనయినా చూడ కుండా శేఖరం కూర్చున్న హాలులోకి వెళ్ళాడు.

'ఇక మీ సారి మాంతకుడు పారి పోలేదు! ఒకసారి తప్పించుకు కుందామని విశ్వప్రయత్నం చేసాడు. రెండవసారి మాతురాలి చివరి వాక్యాలు అతన్ని యిక తప్పించుకోకుండా చేశాయి' అన్నాడు హేళనగా శేఖరం.

'ఎవరిమాట నువ్వనేది శేఖరం!' అన్నాడు ఆశ్చర్యంగా వామనరావు.

'ఇంకెవరు పెద్ద మనిషిగా చలామణీ అవుతున్న ఆనంద రావుగారే' అంటూ యికిలించాడు శేఖరం.

'అసలు జరిగిన విషయ మేమిటి శేఖరం?' అన్నాడు ఆదుర్దాగా వామనరావు.

శేఖరం సమాధానం చెప్పకుండా వెంటనే నౌకర్ని పిలచి జరిగిన విషయం చెప్పమన్నాడు.

నౌకరు భయంతో కంపించి పోతూ 'మీరు వచ్చి వెళ్ళిన అరగంటకు ఆనందబాబుగారు కారులో వచ్చారు. వారు రాగానే అమ్మగారి గదిలోకి వెళ్ళారు. కొంచెంసేపు మెల్లగా మాట్లాడు కోవటం వినిపించింది. ఆ పైన అమ్మగారు వెక్కి వెక్కి ఏడుస్తున్నట్టు విన వచ్చింది. తరువాత ఆ బాబుగారు 'త్వర పడ్డావు ఇందిరా! ఈ విషయాలన్నీ వామనరావుతో చెప్పకుండా వుండాల్సింది. అర్ధాంతరంగా తెలిస్తే శారద ఏమంటుందో! ఎన్ని గొడవలు జరుగుతాయో!' అనటం విన్నాను. ఆ పైన మాటలు వినపడలేదు. ఒక గంట తరువాత బాబుగారు వెళ్ళి పోయాడు. వెంటనే ఒక్క పావు

గంటయినా తిరక్కుండా తిరిగివచ్చి సరాసరి అమ్మగారి గదిలోకి వెళ్ళి ఒక అయిదు నిముషాల్లో బయటకు వెడుతూ గుమ్మంముందు తెల్లబోయి నిలబడ్డ నన్నుచూచి నా చేతిలో ఒకనోటు కుక్కి 'నేను రెండవసారి వచ్చినట్టు ఎవరికీ తెలియ కూడదు తెలిసిందా! ప్రస్తుతానికి యిదివుంచు మళ్ళీయిస్తాను' అంటూ త్వరగా బయటకు వెళ్ళిపోయారు. అప్పుడే ఎనిమిది గంటలవడంవల్ల అమ్మగారికి 'టీ' తయారుచేసి గదిలోకి తీసుకువెళ్ళి చీకటిగా వుండడంవల్ల స్విచ్‌నొక్కి లైటు వేసాను. వెంటనే అక్కడ కనుపించిన దృశ్యంతో నోట మాటరాక నిలబడి పోయాను. అమ్మగారు మంచానికి అడ్డంగా పడి వున్నారు. నోటితో గుడ్డలు కుక్కబడి వున్నాయి. వెంటనే దగ్గరగా వెళ్ళి చూచాను. యింకే ముంది మంచమంతా రక్తం. పరుగెత్తుకుంటూ పోలీసులకు ఫోన్ చేద్దామని హాల్లోకి వచ్చాను. ఎదురుగా ఒక కారు ఆగింది. అందులోంచి ఇన్‌స్పెక్టరు బాబుగారు దిగారు. అప్పుడే ఎలా తెలిసిందా అని ఆశ్చర్యపోతూ ఆ అయ్య గారిని లోపలికి తీసుకువెళ్ళి చూపించాను' అంటూ కన్నీరు తుడుచు కున్నాడు. వెంటనే శేఖరం అందుకుని - 'మీరు స్టేషన్‌లో నాకు ఇందిర చెప్పిన విషయాన్ని గురించి పూర్తిగా విచారిద్దామని మీ వెనకనే బయలుదేరి యిలా వచ్చాను. ఏముంది అసలు మనిషి అపాయంలో వుంది. నేను వెంటనే డాక్టరుకు ఫోన్‌చేసి ఆమెదగ్గరకు వెళ్ళి యింకా కొద్దిగా కొనూపిరి వున్నట్టు గ్రహించి నోటిలో కుక్కబడ్డ గుడ్డలు లాగి ముఖంమీద కొద్దిగా నీరు జిలకరించి రెండు చెమ్చాలు గొంతులో పోసాను. ఆమె కళ్ళు విప్పటానికి ప్రయత్నిస్తూ-

ఎం...త...పని... చే...శావు... ఆ...నం...ద్ - అంది. అంతే. ఆ తరువాత నేను గొంతులో పోసిన నీరు బయటకు వచ్చేసింది. డాక్టరువచ్చి ఆమెను పరీక్షిస్తున్నారు. యింతలో నేను మీకు ఫోన్ చేసాను. చూశారా! మీక్కయింటు ఆనందరావుగారి అత్యాచారం' అంటూ చెప్పిపొడిచినట్టు మాట్లాడాడు.

వామనరావు సమాధానం చెప్పకుండా యోచన ప్రారంభించాడు. ఇంతలో డాక్టరు యివతలకు వచ్చి ఇందిరను హంతకుడు వెన్నులో కత్తితో పొడిచి బలంగా గాయపరచి చంపాడని, అంతా ఓ అరగంటలోపే నని, తన పరిశోధనా ఫలితం చెప్పాడు. ఆయన వెనకనే బయటకు వచ్చిన వ్రేలి ముద్రల నిపుణుడు 'కత్తిమీద తప్ప యితర చోట్ల - ఆనందరావుగారి వ్రేలి ముద్రలు కనుపిస్తున్నాయి' అని చెప్పాడు.

శవాన్ని మార్చ్యురీకి పంపి శేఖరం ఆనందరావుగారి యింటికి వెళ్ళి ఇందిర మరణంతో మతిపోయినట్టున్న ఆనందరావుగారిని అరెస్టుచేసి జైలుకు తీసుకు పోయాడు.

## 10

'ఏమయినా సమాధానం చెప్పాడా?' అప్పుడే ఆనందరావుతో మాట్లాడి యివతలకు వచ్చిన వామనరావుని చూస్తూ శేఖరం అడిగాడు జైలు ఆవరణలో.

'చెప్పవలసినంతవరకు చెప్పాడు! ఇందిర చెప్పిన విషయాలన్నీ పదహారణాల సత్యమని ఒప్పుకున్నాడు. తను

ఇందిరవద్దకు సాయంత్రం ఏడుగంటల్లోపు వెళ్ళానని అక్కడి నుండి తిరిగి ఎనిమిదిగంటలముందుగానే బయటకు వచ్చానని నౌకరు చెప్తున్నట్టు రెండవసారి తను ఆయింటిఛాయలకు కూడా పోలేదని ప్రమాణంచేసి చెపుతున్నాడు' అన్నాడు.

'నాకు తెలుసుబాబూ! ఈ ఆనందరావుగారు మొదటి నుంచీ ఒక పెద్దనాటకం ఆడుతున్నాడని. మధ్యమీరు కల్పించుకుని అనవసరంగా ఆయనకు బైల్ యిచ్చి యీ రెండవ హత్య జరిగేందుకు అవకాశం కల్పించారు' అన్నాడు శేఖరం.

శేఖరం తనమీద వేసిన అంతపెద్ద అభాండాన్ని నవ్వుతూ తోసేసి వామనరావు - 'అయితే శేఖరం! తనను యింతగా ఆరాధిస్తూ, తనకోసం పెద్దత్యాగానికి సిద్ధపడ్డ ఇందిరను చంపడానికి ఆనందరావుగారికేం అవసరంవచ్చిందంటావు' అన్నాడు.

ఈమాత్రంకూడా తెలియదా అన్నట్టు నవ్వుతూ శేఖరం-నావుద్దేశంలో ఆనందరావుగారు ఇందిరను హృదయపూర్వకంగా ప్రేమించలేదనే. కామంవల్లగాని, లేక ఆమె ఆస్తిమీదవుండే మోజుకొద్దీగాని ఆమెను వల్లో వేసుకుని ఆమె ఆస్తిని కాజెయ్యాలని భావించివుంటాడు. ఆమెను త్వరగా వివాహంచేసుకోమని అతను కోరటంకూడా వుత్తనాటకమే! నాలుగులక్షల రూపాయల ఆస్తిని చూస్తూ చూస్తూ ఆమె వదలలేదని - తను బలవంతంచేసినా ఆమె ఒక సంవత్సరం వివాహంకోసం ఆగగలదని దాంతో తనకు ఆమె డబ్బుమీద ఏమాత్రం ఆశలేనట్టు ఇందిర పూర్తిగా విశ్వసిస్తుందని ఆయన

ఆలోచించే యీవిధంగా నటించాడు. అదీగాక బీచిలో ముక్కూమొహంఎరుగని ఆడదాన్ని అవమానపరచబోయి హత్యచేసిన యీ ఆనందరావు హృదయంలో ప్రేమకు తావెక్కడిది? ఎప్పుడైతే ఇందిర మీతో అన్నివిషయాలు చెప్పిందని గుర్తించాడో వెంటనే ఆ విషయాలు తనభార్యకు తెలిస్తే ప్రమాదమని చెప్పి ఆమెను అంతమొందించాడు. అంటే చనిపోయిన స్త్రీమీద స్త్రీఅయిన శారదాంబ అంత కక్షకట్టుకోదు. ఎలాగో ఒకలాగ సర్ది చెప్పుకోవచ్చుననే ఆయన భావన. చూచారా! ఎంతపెద్దనాటకం అమోఘంగా నటించాడో' అంటూ తన పరిశోధనలకు తెలివికి తనే గర్వపడుతూ భుజాలెగరవేస్తూ అన్నాడు శేఖరం.

'బాస్!' అని బిగ్గరగా అరుస్తూ పాణి స్ప్రింగ్ డోర్స్ తోసుకుని లోనికివచ్చాడు.

'ఏమిటిపాణి! యింతసేపూ ఎక్కడికి మాయమైనావు? ఇందిర విషయం......' అంటుండగానే పాణి అందుకుని - 'తెలుసుబాస్! అక్కడినించే వస్తున్నాను. నేను అతిముఖ్యమైన పనిమీద రాజన్ చెల్లెలు కబురు పంపితే వెళ్ళాను' అన్నాడు.

'అహా! అంతవరకూ వచ్చిందీ ప్రేమకాండ' అన్నాడు వామనరావు చిరునవ్వుతో.

'ప్రేమకాండవిషయం దేముడెరుగు ముందు యిలా చూడు' అంటూ ఒక పెద్ద కవరు తీసి వామనరావు చేతికి యిచ్చాడు.

వామనరావు ఆత్రంగా కవరు తీసి అందుండి పేపరు బయటకు లాగి చదవసాగాడు. ఒకటి-రెండు-మూడు ఎన్ని

సార్లు చదివాడో అతనికే తెలియదు. ప్రతిసారి అతనిముఖం మార్పు చెంది క్రమంగా వుత్సాహంతో నిండిపోయింది. అప్రయత్నంగా 'ఓహో' అన్నాడు.

ఇదంతా ఏమిటో అర్థంగాక తెల్లబోయి చూస్తున్న శేఖరం 'ఆవార్త ఏమిటో నాకుకూడా చెప్పకూడదా' అన్నాడు.

'ఇప్పుడు కాదు శేఖరం! దీనికికూడా సమయం వొస్తుంది. ప్రస్తుతం నీవల్ల ఒక ముఖ్యకార్యం జరగాలి. ఆనంద రావుగారు బైల్ మీద విడుదలజరగాలి. రెండంటే-రెండు రోజులు-మూడోనాడుదయం నేను తీసుకువచ్చి నీకప్ప గిస్తాగా' అన్నాడు ప్రతిమాలుతున్నట్టు.

'ఇంపాజిబుల్! అది జరగనిపని. ఒకటికి రెండుహత్యలు-మోసాలుచేసిన ఆయన జామీనుమీద విడుదలవటం కష్టం' అన్నాడు శేఖరం ఖచ్చితంగా.

'జరిగి తీరాలి శేఖర్! ఈ విషయంలో కావాలంటే నేను ఐ. జి. గార్నైయినా కలుసుకుంటాను. మంత్రులదాకా నయినా వెడతాను' అన్నాడు ఆవేశంగా.

'మీయిష్టం. నా అభ్యంతర మేముంటుంది' అన్నాడు శేఖరం.

'పదపాణీ!' అంటూ త్వరగా లేచి తెల్లబోయి చూస్తున్న శేఖర్ని అలా వదిలి బయటకు వెళ్ళిపోయాడు వామనరావు.

ఆ సాయంత్రం అయిదుగంటలకు డి. యస్. పి. గారి వద్దనుంచి 'ఆనందరావును రెండురోజులపాటు బైలుమీద విడుదల చెయ్యవలసిందిగా' వచ్చిన తాఖీదు చూచుకుని

శేఖరం-వామనరావుకుగల పలుకుబడికి కొంత యీర్ష్యపడక పోలేదు. వెంటనే ఆనందరావు విడుదలకూడా జరిగింది.

## 11

ఉదయం పదకొండుగంటలసమయం. 'ఆనంద్ ఫైనాన్సు కార్పొరేషన్' భవనంముందు ఒక జీప్ కారు, ఒక పోలీసువాన్ వచ్చి ఆగాయి. వాటి వెనుకనే వామనరావు కంచురథంకూడా వచ్చి ఆగింది.

జీప్‌నుంచి క్రిందకు వురికిన ఇన్‌స్పెక్టర్ శేఖరం మరి యిద్దరు కానిస్టేబిల్సును భవనం వెనుకవైపుద్వారం కాయమని పంపి వాన్‌లోంచి దిగిన రిజర్వుదళాన్ని నాలుగు పక్కలా ఏర్పాటుచేసి లోనుండి ఎవరైనా పారిపోయేందుకు ప్రయత్నిస్తే కాల్చెయ్యమని ఆర్డరు జారీచేసి తను వామన రావు ముందు నడవగా ఆనందరావు గారి ప్రైవేటు గదిలోకి వెళ్ళాడు.

ఆకస్మాత్తుగా గదిలోకి ప్రవేశించిన డిటెక్టివ్, ఇన్‌స్పెక్టర్లను చూచి అక్కడ వున్న యిద్దరిలో ఒక వ్యక్తి చట్టున వారివంక తిరిగి కోటుజేబులోకి చెయ్యిపెట్టబోగా తన రివాల్వర్‌ను ఆ వ్యక్తి గుండెలకు గురిచూపుతూ 'హాండ్సప్! రాజన్ మహాశయా!' త్వరపడి కోటుజేబులోకి చెయ్యివెళ్ళిందా ఇక అంతే' అన్నాడుపాణి. చేసేదిలేక రాజన్ చేతులెత్తి నిలబడ్డాడు. శేఖరం వెంటనే అతని దగ్గరగా వెళ్ళి జేబునుండి అతని పిస్టలు బయటకుతీసి పక్కనేవున్న కానిస్టేబుల్ చేతికి యిచ్చాడు.

'ఇన్‌స్పెక్టర్ సాబ్! హత్యలకు-మోసాలకు మూలకారణ మయిన ఆ నారీహంతకుని బంధించండి' అన్నాడు వామన రావు శేఖరంతో రెండో వ్యక్తిని చూపిస్తూ.

గోడవైపు ముఖం తిప్పి నిలబడ్డ వ్యక్తివద్దకుపోయి శేఖరం అతన్ని తనవైపు తిప్పుకుని చేతులకు బేడీలువేస్తూ అతని ముఖం పరికించి తెల్లబోయి వెంటనే తేరుకుని - 'నేను మొదటినుంచీ చెప్పానుగా బాబూ! ఆనందరావుగారే హంతకుడని' అంటూ తను బంధించిన వ్యక్తి వంక చూస్తూ- 'నడవండి ఆనందరావుగారూ! ఆ రాత్రి మిమ్మల్ని బంధిం చటమంటే నాలోని ప్రతినరమూ దుఃఖించింది. ఈరోజు మాత్రం ఆనందంతో నాహృదయం పురకలువేస్తున్నది' అన్నాడు శేఖరం.

'పొరపడ్డావు శేఖరం' అంటూ ఒక వ్యక్తి ఆ గదిలోకి కాలుపెట్టాడు.

ఆ వ్యక్తిని చూడగానే శేఖరం తెల్లబోయి తను చూస్తు న్నది కలో నిజమో అనుకుంటూ కళ్ళు నలుపుకుని చూచాడు.

అతని అవస్థ గమనించి వామనరావు నవ్వుతూ 'అవస్థ పడకు శేఖరం! అసలు ఆనందరావు యితనే నువ్వు. బంధిం చింది నకిలీ ఆనందరావు' అంటూ ఆనందరావుగారి చెయ్యి ఆప్యాయంగా నిమురసాగాడు.

శేఖరం సిగ్గుతో తలవంచుకుని 'సారీ! వామనరావుగారూ! త్వరపడి మిమ్మల్ని ఏమేమో అన్నాను యిప్పుడు విచారిస్తు న్నాను' అన్నాడు.

'ఫరవాలేదు. అనవసరంగా బాధపడకు. ఆ! వారిరువురిని నీ సైన్యానికి వప్పచెప్పి, నువ్వు ఆనందరావుగారి యింటికిరా తీరిగ్గా మాట్లాడుకుందాం' అంటూ పాణి చెయ్యి ఒక చేత్తోనూ ఆనందరావుగారి చెయ్యి మరో చేత్తోనూ తీసుకుని బయటకు నడచాడు వామనరావు.

ఒక్క నిముషం వారివంక తెల్లపోయి చూస్తున్న శేఖరం తన బందీలను తీసుకుని ముందుకు నడచాడు.

## 12

ఆనందరావుగారి యింట్లో వామనరావు-పాణీలు ఒక సోఫాలోనూ, ఆనందరావు - శారదాంబలు మరోసోఫాలోనూ ఎదురుగావున్న కుర్చీలలో శేఖరం, గౌరీ కూర్చున్నారు. ఒక్క నిముషం నిశ్శబ్దం.

'అన్నయ్య యింత దారుణం చేస్తాడనుకోలేదు' అంటూ తన సంతాపం వ్యక్తపరచింది గౌరి.

వామనరావు విషాదంగా నవ్వుతూ 'పిచ్చితల్లీ డబ్బమ్మా! డబ్బు! ఆ డబ్బుకోసం మానవుడు ఒకొక్కసారి పిశాచంలాగ ప్రవర్తిస్తుంటాడు. అసలు మానవ స్వభావమే అంత. తనకు లేనిది యితరులకు వున్నది పొందాలని ఆరాటపడుతూ ఉంటుంది' అన్నాడు.

'ఇంత అతిక్లిష్టమయిన కేసును మీరు ఎలాపరిశోధించారో చెప్పరూ' అంది శారదాంబ.

వామనరావు కొంతసేపు నిశ్శబ్దంగా కళ్ళుమూసుకుని కూరుకుని రెండు నిముషాల తరువాత గౌరి వంక అప్యా

యంగాచూస్తూ 'ఈకేసు విజయానికి చాలాభాగం సహాయం చేసింది యీ గౌరి! నా పరిశోధనలు, ఆమె సహాయం మిళితంచేసి హంతకులను కనుకున్నాం' అన్నాడు.

'గౌరా? ఏవిధంగా' అంది శారదాంబ ఆమెవంక ఆప్యాయంగా చూస్తూ.

'దీనికంతకూ మూలకారకుడు అసలు రాజన్! ఆనందరావుగారు అతనిని అమితంగా నమ్మి తన వ్యాపారమేగాక వ్యక్తిగత విషయాలుకూడా అతనికి చెప్పేవారు. అలాటి వ్యక్తిగత విషయమే ఆనందరావు గారి తల్లి చనిపోయినప్పుడు ఆయన తను వెళ్ళకుండా రాజన్ని ఆ ఆస్తికోసం పంపారు. అలా ఆ ఆస్తిని స్వాధీనపరచుకోవాలని వెళ్ళిన రాజన్కు అక్కడ ఓ వుత్తరం దొరికింది. ఆ వుత్తరమే నాకు గౌరి అందజేసింది, అదే నాకు యీ కేసును యింత త్వరగా విడగొట్టటానికి సహాయంచేసింది. ఆ వుత్తరంలోని విషయమేమిటంటే 'ఆనందరావుగారు అంతవరకు ఎవరినయితే తన తండ్రిగా భావించాడో ఆ స్కూలు మాష్టరు అసలు అతని తండ్రికాదని, అసలుతండ్రి ఆమె గర్భంధరించి కవలశిశువులను కన్న ఆరో రోజున దరిద్రం భరించలేక తన దగ్గరున్న ఆరు రూపాయలలో మూడు రూపాయలు ఆమెకు వదలి, పుట్టిన కవల శిశువులలో ఒకరిని తీసుకుని అర్ధరాత్రి యిల్లువదలి వెళ్ళిపోయాడని - తను అతని రాకకోసం రెండు సంవత్సరాలు వేచివుండి యిక రాడు అని నిర్ధారణచేసుకుని తన చిన్న ఆనంద్ కోసం అతనికి ఒక సంరక్షకుడుగా వుంటానని ప్రతిజ్ఞలుచేసిన ఒక స్కూలు మాష్టర్ని వివాహం చేసుకుందనీ

ఆతరువాత వారు వారి సొంతటి గ్రామం వదలి చాలా దూరంవచ్చి స్థిరపడిపోయారని - ఆవిధంగా చెయ్యటంవల్ల ఆనంద్ పెరిగి పెద్దవాడయినాకూడా ఆ స్కూలు మాష్టరు అతని తండ్రికాడని సవతితండ్రి అని తెలిసినవారెవరూ చెప్పేందుకువుండరని ఆతని బాగుకోరే అలా చేసాననీ అయితే ఎన్నో సంవత్సరాలుగా తన ద్వితీయ భర్తకూడా మరణించినా, ఆనందరావు డబ్బు, పలుకుబడి సంపాదించినా ఆ యిల్లు, ఆ ప్రదేశం వదలటానికి యిష్టంలేక తానక్కడే వుండిపోయాననీ. తన పొట్టపోసుకునేందుకు చాలినంత ఆస్థి తన భర్త సంపాదించి యివ్వటంవల్ల ఆనందరావు డబ్బుకు తాను ఆశించలేదని ఎన్నిసార్లు పంపినా మర్యాదగా తిప్పి పంపింది అందుకేగాని మరే యితర ఉద్దేశాలు లేవని, తను మరణించబోతున్న యీ సమయంలోనయినా ఆనందరావుకి యీ విషయం తెల్పటం తన విధ్యుక్త ధర్మమని యిలా రాస్తున్నాననీ, ఏనాటికయినా ఆనందరావు తమ కవల సోదరుని - అతని పేరూ ఆనంద్! - కలుసుకోవటం సంభ విస్తే అతను మంచిమార్గంగా పోతున్నట్టయితే, వీలయినంత సహాయం చెయ్యవలసిందని - ఆనందరావు అసలుతండ్రి నాటకాల్లో తిరిగేవాడని అలాగే అతని సోదరుడుకూడా ఏ నాటక కంపెనీలోనయినా వుండివుండవచ్చునని తాను ఆశిస్తున్నాను'అని ఆమె ఆనందరావుగారిపేర ఒక వుత్తరం వ్రాసిపెట్టింది. అది రాజన్ కళ్ళ బడింది. దాంతో అత నిలో ఆశాపిశాచం ఆవేశించివుంటుంది. అప్పటికే ఇందిరా ఆనంగుల విలాస విహారాలు ప్రారంభం అయివుండటంవల్ల కొలది నాలుగయిదు రోజాలు ఆనందరావుగారు రహస్యంగా

గ్రామాంతరంలో వుంటూ తను ఆఫీసులో వున్నట్టే ప్రవ ర్తించవలసిందిగా రాజన్‌ను ఆదేశించడంవల్ల ఈ అదను కల్పించుకుని అంతకుముందు తనకు నాటకాల్లోవున్న అను భవంతోనూ నాటక కంపెనీలవారితో వున్న పరిచయం తోనూ ఏలాగో ఆనందరావు గారి కవలసోదరుడు ఆనంద్‌ను కలుసుకుని అతనితో ఆనందరావుగారు గడుపుతున్న సుఖ మైన జీవితంగురించి, అతని ఆస్థిపాస్తుల్ని గురించిచెప్పి అత నిలో ఆనందరావుగారిమీద ప్రతీకారవాంఛ ఒకటి లేవగొట్టి వుంటాడు. దాంతో వారిద్దరూచేరి ఆనందరావుగారు లేని సమయంలో బోగస్ అగ్రిమెంట్లు సృష్టించి ధనం సంపా దించడం ప్రారంభించారు. వీరిద్దరూ కవలసోదరులవటంవల్ల, ఆనందరావు - ఆనంద్‌ల మధ్య ఏమాత్రం పోలికల్లోగాని, ముద్రికాల్లో, ఆవేశాల్లోగాని, మాట తీరులలోగాని ఎంత మాత్రం భేదం వుండకపోవటం సమంజసం. అంతేగాక వారి వ్రాతలు, వేలిముద్రలుకూడా భేదంలేకుండా వుండ వచ్చునంటూ 'కవల పిల్లలు'నుగూర్చి ఒక ఆంగ్లేయుడు వ్రాసిన ఒక గొప్ప గ్రంథంలో పేర్కొనబడింది. సరే యింకేముంది, రాజన్‌కు చక్కని అవకాశం. ఆనందరావు ఏ ఏ దుస్తులు ధరిస్తాడో - ఏ ఏ సమయాల్లో ఎటువంటి పనులు చేస్తాడో తెలుసు గనుక రాజన్ యీ పద్ధతు లన్నీ అతనికి తెలియజెప్పి ఆనందరావుగా రిలాగా నటింప చేసాడు. అసలే నటుడు - ఆపైన చక్కని అవకాశం ఆనంద్ మాత్రం ఎందుకు ఉపయోగించుకోడు?

'ఆవిధంగా నకిలీ ఆనందరావు సహాయంతో రాజన్ బోగస్ అగ్రిమెంట్లు సృష్టించి అధిక ధనం సంపాదించాడు.

అంతేగాక ఆనందరావుగారిమీద పగబట్టిన ఆనంద్ అతనికి ఎలాగయినా అపకారం చెయ్యాలని నిశ్చయించుకొని ఆయన కాంతారావుగారింట్లో విందుకు వెళ్ళి అక్కడనుండి రహస్యంగా ఇందిరను చూడటానికి వెళ్ళినపుడు అతని కారును దొంగిలించి ఆనందరావుగారు ధరించిన దుస్తులే ధరించి బీచిలో మీనాక్షి మానహరణయత్నం - ఆ పైన కత్తితో పొడచి పారిపోవటం జరిగింది. ఆసమయంలో మీనాక్షికి దొరికిన ఆ పెన్ను అంతక్రితమెప్పుడో ఆనందరావుగారి ఆఫీసు నుండి ఆనంద్ తీసుకున్నదే. తనమీద హత్యా నేరానికయినా, అపనిందకయినా సిద్ధపడుతారు కాని, ఇందిరతో రహస్య సమావేశం బయటపెట్టరనే వారి భావన. ఆవిధంగా మీనాక్షి హత్య జరిపి కారును మామూలుగా ఆనందరావుగారు వదలిన ప్రదేశంలో వదలి వెళ్ళిపోయాడు ఆనంద్. ఆ విధంగా వారు పన్నిన వుచ్చులో తగులుకున్నారు ఆనందరావుగారు.

'ఆమధ్య నేను రాజన్‌తో మాట్లాడుదామని వారి యింటికి వెళ్ళినపుడు అక్కడ ఆనందరావుగారిని చూచి చూచి నేను ఆశ్చర్యపోయాను' అంటూ పాణి వంక తిరిగి వామనరావు 'ఆవిషయం నువ్వు గుర్తించలేదులే! అప్పుడు నువ్వు గౌరీ మహాత్యంలో వున్నావు!' అంటూ నవ్వాడు.

గౌరి బుగ్గలు సిగ్గుతో ఎరుపెక్కాయి. వెంటనే అక్కడి నుంచి లేచి లోనికిపోయింది. 'గౌరీ' అంటూ పాణికూడా ఆమెను అనుసరించాడు. వామనరావు వారు పోయిన వంకే చూస్తూ ఆప్యాయంగా 'A Nice pair' అనుకుని తన పరిశోధనలు చెప్పటం ప్రారంభించాడు.

'అలా అక్కడ ఆనందరావుగారే నాకు కనుపించారని అనుకుని ఆయనమీద అపోహపడ్డానుకూడా!

'అవిధంగా ఆ గృహంలో ఆనంద్‌ను నేను గుర్తించానని పసికట్టిన రాజన్ ఆయనను ఆ గృహంనుండి మార్చి మారు మూలగా కన్నమ్మపేటలో ఒక చిన్నయింట్లో వుంచాడు.

'అయితే కోర్టులో ఎప్పుడయితే మేము ఒక ముఖ్యసాక్షిని ప్రవేశపెట్టబోతున్నామని ప్రకటించామో వెంటనే వారు ఆ విషయాన్ని అర్థంచేసుకుని ఆ సాక్షి ఇందిర తప్ప మరో కయ కారని గ్రహించి ఆనందరావుగారు ఆయింటికి వెళ్ళటం కనిపెట్టి ఆయన తిరిగి వచ్చిన వెంటనే నకిలీ ఆనందరావు లోపల ప్రవేశించి ఇందిరనోట్లో గుడ్డలు కుక్కి ఆమెను హత్యచేసి పారిపోతూ ఎదురుపడ్డ నౌకరుకు అసలు ఆనంద రావే అని భ్రమకల్గించాలని వందరూపాయలనోటుయిచ్చి 'నేను తిరిగి వచ్చినట్లు ఎవరితోనూ చెప్పవద్దు అన్నాడు. పాపం ఆ అమాయకుడు అలాగే అనుకున్నాడు. ఇందిర కూడా తనను గాయపరచింది. ఆనందరావే అనుకుంది కాబట్టి ప్రాణంపోయేముందు 'ఎంతపనిచేశావు ఆనంద్' అంది.

'ఆ తరువాతే పాణి తనకు గౌరి యిచ్చిన ఉత్తరం యిచ్చాడు. అది చూడగానే నాలోని అనుమానమేఘాలు విడిపోయాయి. ఒకసారి ఆనందరావుగారిని బైలుమీద విడుదలచెయ్యమని శేఖర్‌ని కోరాను. అలా విడుదల చేయించిన ఆనందరావుగారిని తిరిగి గ్రామాంతరం వెడుతున్నట్టు నటించమన్నాను. అనుకున్నప్రకారం రాజన్ నా వుచ్చులో పడ్డాడు. మిగిలిన కొన్నిపనులు చక్కపెట్టుకునేం దుకు యినప్పెట్టెలోని డబ్బు హరించేందుకు నకిలీ ఆనంద్‌తో సహా రాజన్ ఆఫీసుకు వచ్చి మనకు పట్టుబడ్డాడు. మరొక

రోజు ఆలస్యమయి వుంటే అతను సిలోన్ పారిపోయేవాడే. అందుకు కావలసిన రైలు టిక్కెట్లు, పాస్‌పోర్ట్సు సిద్ధంచేయించాడుకూడా' అంటూ తన దీర్ఘపరిశోధనను వినిపించి కళ్ళుమూసుకుని కుర్చీలో వెనక్కి వాలాడు.

'మాకు యింత సహాయం జేసిన మీకు ఎలా కృతజ్ఞత తెలియపర్చాలో తెలియటంలేదు. నామాంగళ్యం కాపాడారు' అంటూ శారదాంబ రెండు చేతులూ ఎత్తి వామన రావుగారికి నమస్కరించింది.

'ఒక్కమాట శారదాంబగారూ? ఆనందరావుగారిమీద మీరు ఇందిర విషయంలో దురభిప్రాయపడవద్దని కోరుతున్నాను. మానవహృదయ బలహీనతవల్ల ఒకొక్కప్పుడు అనుకోకుండా అనేక సంఘటనలు జరుగుతూంటాయి. వాటిని ఎదుర్కొనటానికి ఒక మానవాతీతమైన శక్తి కావాల్సి వుంటుంది. అందువల్ల ఆనందరావుగారు, మీరు ఎప్పటిమాదిరిగానే వుంటారని ఆశిస్తున్నాను' అన్నాడు.

సమాధానంగా శారదాంబ ఆనందరావు చేతిని తన చేతిలోకి తీసుకుని ఆప్యాయంగా నిమురుతూ 'మీరు దక్కారు. నాకదే పదివేలు' అంటూ కళ్ళొత్తుకుంది.

'శారదా!' అన్నాడు ఆనందరావు కృతజ్ఞతా పూర్వకంగా.

ఇంతలో లోపలనుండి 'బాస్! బాస్!' అంటూ అరుచుకుంటూ వచ్చిన పాణి - మెల్లగా వామనరావు చెవిదగ్గరగా వంగి 'గౌరి నన్ను పెళ్ళాడటానికి ఒప్పుకుంది' అన్నాడు.

వామనరావు విరగబడి నవ్వుతూ అప్పుడే హాలులో అడుగుపెట్టిన గౌరివంక చూస్తూ 'రక్షించావు తల్లీ! ఇక

యీ సౌందర్యోపాసకుడి భారమంతా నీకు వప్పగిస్తున్నాను.
ఎలా కాపాడతావో' అంటూ తను సోఫా నుండి లేచి పాణి
గారిలను సోఫాలో ఆసీనుల్ని చేసాడు.

'నాకెంతో ఆనందంగా వుంది. యీ వార్త. ఆ!
వామనరావు గారూ! అన్నట్టు రాజన్ ఖాళీచేసిన ఆ మేనే
జర్ గిరి పాణి ఎందుకు భర్తీ చెయ్యకూడదు' అన్నాడు
ఆనందరావు ఆనందంగా.

'ఒక్క షరతు మీద. నాకు కావల్సినప్పుడల్లా అతనిని
మీరు నా సహాయానికి పంపుతానని మాట యివ్వండి'
అన్నాడు వామనరావు.

'తప్పకుండా! మీరడిగితే కాదనగల విషయమే లేదు'
అన్నాడు ఆనందరావు.

ఒక్క నిముషం తరువాత వామనరావు శేఖర్ వంక
చూస్తూ - 'పద శేఖర్! ఆనంద మయులైన యీ దంపతీ
జంటల మధ్య బ్రహ్మచార్లం మనమెందుకు పానకంలో
పుడకలలా. పద పోయి అలా ఓడియన్ లో 'వార్ అండ్
పీస్' చూద్దాం' అంటూ శేఖర్ చెయ్యి పట్టుకుని బయటకు
నడచాడు.

అలా వెళుతున్న వామనరావుకి పాణి గారులు - శార
దాంబ ఆనందరావులు రెండు చేతులూ ఎత్తి నమస్క-
రించారు.

—::—